# చంద్రకిరణాలు

(గేయ సంపుటి)

**భక్తి, దేశభక్తి, ప్రబోధాత్మక గేయాలు !**

**నిత్య జీవిత ప్రతిబింబాలు !!**

**విజ్ఞాన, జ్ఞాన, జానపద గేతికలు**


రచన :

లలిత కళాప్రవీణ, కళాసాహితీ ప్రపూర్ణ,

అభ్యుదయ రచయిత.

డాక్టర్ కుడుపూడి సత్యనారాయణ

ఎం.బి.బి.ఎస్.; డి.జి.ఎస్.; సర్జరీ స్పెషలిస్ట్,

వాలంటరీ రిటైర్డ్ డిప్యూటీ సివిల్ సర్జన్.

దుంగావారి వీధి. డోర్ నెం. 5-4-3

# చంద్రకిరణాలు

## (గేయ సంపుటి)

**భక్తి, దేశభక్తి, ప్రబోధాత్మక గేయాలు !**

**నిత్య జీవిత ప్రతిబింబాలు !!**

**విజ్ఞాన, జ్ఞాన, జానపద గేతికలు**


రచన :

లలిత కళాప్రవీణ, కళాసాహితీ ప్రపూర్ణ,

అభ్యుదయ రచయిత.

**డాక్టర్ కుడుపూడి సత్యనారాయణ**

*ఎం.బి.బి.ఎస్.; డి.జి.ఎస్.; సర్జరీ స్పెషలిస్ట్,*

*వాలంటరీ రిటైర్డ్ డిప్యూటీ సివిల్ సర్జన్.*

దుంగావారి వీధి, డోర్ నెం. 5-4-3

సూర్యనగర్, అమలాపురం, తూ॥గో॥ జిల్లా

మొదటి ప్రచురణ : 1000 ప్రతులు

1998 జనవరి

మూల్యం : రూ. 80/-

డిస్కౌంటు

ముద్రణ :

**వైట్‌వింగ్ ఆఫ్‌సెట్ ప్రింటింగ్ ప్రెస్**

రాజమండ్రి, ఫోన్ : 63534

ప్రతులకు :

మీ అభిప్రాయములు తెలుపుటకు

**శ్రీమతి కె. భాగ్యలక్ష్మి**

W/o. **డాక్టర్ కుడుపూడి సత్యనారాయణ**

ఎం.బి.బి.ఎస్.; డి.జి.ఎస్.

సర్జన్ & వాలంటరీ రిటైర్డ్ డిప్యూటీ సివిల్ సర్జన్

**దుంగావారి వీధి, డోర్ నెం. 5-4-3**

**సూర్యనగర్, అమలాపురం, తూ॥గో॥ జిల్లా**

# విషయ సూచిక

S.No. P.No.

## రచయిత మాతృమూర్తి స్వర్గీయ శ్రీమతి సౌభాగ్యమ్మగారు



నా యీ పుస్తకాన్ని
జన్మనిచ్చిన నా తల్లి
శ్రీమతి కె.
సౌభాగ్యమ్మ గార్కి
మరియు
నేను పుట్టి పెరిగిన
జన్మభూమి
భారతమాత'కు
అంకితమిస్తున్నాను.

ఇట్లు
రచయిత : డాక్టర్ కుడుపూడి

నా పితృదేవులు శ్రీ శివరామదాసుగారి చరణాలకు నా ప్రధమ రచన "ఉదయ కిరణాలు" గేయకావ్యమంకితమీయబడినది.

**నామాతాపితరులకు నమస్కృతులు !**
**నా మాతృభూమికి నమస్కృతులు !!**




ది. 6-3-1988వ సం॥లో త్యాగరాజ స్వామివారి స్వర్ణోత్సవ ఆరాధన మహోత్సవ సభ సందర్భమున తాడేపల్లిగూడెంలో "జన్మనిచ్చిన కన్నతల్లికి - పుట్టిపెరిగిన జన్మభూమికి సాటియగునె స్వర్గం" గేయాన్ని ఆర్ద్రతతో అంకిత భావంతో పాడి గాన సుధను పంచుతున్న డాక్టర్ కుడుపూడి

దుష్టు - నైనా - శిష్టు - నైనా - యోగి - నైనా - భోగి - నైనా !
రాజు - నైనా - పేద - నైనా - కులము - మతము*- భేద - మెంచక
బ్రతుకు - నం*దు చావునం*దు - సర్వ- సమముగ - ఒడిని - దాల్చే
పుడమి- తల్లికి - జన్మ - భూమికి- శతసహస్రనమస్కృతులు



ఈ పుస్తక రచయిత

లలిత కళాప్రవీణ;

కళాసాహితీ ప్రపూర్ణ;

అభ్యుదయరచయిత

## డాక్టర్ కుడుపూడి సత్యనారాయణ,

ఎం.బి.బి.ఎస్., డి.జి.ఎస్.

వాలంటరీ రిటైర్డ్ డిప్యూటీ సివిల్ సర్జన్, సర్జరీ స్పెషలిస్ట్

మరియు వారి సతీమణి

## శ్రీమతి భాగ్యలక్ష్మి

# పరిచయం

ఈ గ్రంథ రచయిత డాక్టర్ కుదుపూడి సత్యనారాయణ గారి గురించి కేవలం పరిచయ వాక్యాలేగాక అనేక ఆశక్తికర విషయాలను పాఠకమహాశయుల దృష్టికి తీసుకురాకుంటే నా విధి పూర్తయినట్లు కాదని భావిస్తున్నాను.

యిటు వైద్య సేవారంగంలో మాత్రమేగాక, అటు సాహిత్య సంగీతాలనేకకాలంలో సంధించి శ్రోతల రంజింపజేయగల ప్రక్రియ అనన్య సామాన్యం. అందులోను సమాజ స్ఫూర్తి, సందేశ, ప్రబోధాత్మకరచనలను, అభ్యుదయ ఆధ్యాత్మిక, భక్తి, వైరాగ్య జ్ఞానరచనలతో, జానపదాలు రచించడం, పాత కొత్తల మేళవింపులతో, సొంపుగా సాగిన డాక్టర్ కుదుపూడి గారి యీ గేయాలు ఒక నిజమైన మానవతామూర్తి అంతరంగ తరంగాలు, దర్పణాలు మాత్రమే.

అను నిత్యం సమాజంలో జరుగుతున్న అనేక సంఘటనలకు సంఘర్షణలకు తమ గుండెలలో ప్రభవించిన భావాలు సంగీత సాహిత్య రూపంలో ఏక కాలంలో వీరు వెలువరించడం ఒక విశేషమేమరి. కులాలతో కుళ్ళిపోతున్న సమాజానికి తీవ్రంగా స్పందించి "**కులంతో కొలతలు**" అనే ఒక పద్యగద్య కావ్యాన్ని అందించారు గతంలో. అనునిత్యం సంఘంలో జరుగుతున్న సంఘర్షణలపై సమస్యలపై, సాంఘిక దురాచారాలపై మద్యపానంపై అనేకమార్లు యెన్నో గేయరచనలు గావించి ప్రచురించి సమాజసేవకు తమవాణిని, బాణీని అందించారు. ప్రజాజీవితాన్ని అల్లకల్లోలం చేసిన 1985 సం॥ ఆగస్టు నెలలో గోదావరి వరదలు, ప్రకృతి వైపరీత్యాలపైన, దేశ ప్రధానమంత్రి యిందిరాగాంధీ రాజీవ్‌గాంధీల హత్యావార్తలు విన్నంతనే ఉద్వేగభరితంగా స్పందించి వార్తలు వెలవడి వెనువెంటనే మరునాటికల్లా "**ఇందిరమ్మ**" అనే గేయసంపుటిని "**అమరజీవి రాజీవ్‌గాంధీ**" అనే గేయ సంపుటిని వ్రాసి ప్రచురించి ఆవేదనా పూరితంగా ఒకదేశపౌరునిగా, ఒక రయితగా తమ వంతు నివాళ్ళులర్పించారు. కొవ్వూరులో జరిగిన గీతాయజ్ఞ కార్యక్రమానికి "**శ్రీకృష్ణ గీతావళిని**" రుద్రయాగం సందర్భంలో "**శివగీతావళిని**" శ్రీరామమందిర నిర్మాణ సమయాన "**శ్రీరామగీతావళి**" ని కార్య నిర్వాహకులు ఆహ్వానమందించిన మరునాడే భక్తిరసాత్మక గేయాలను రచించి, ముద్రణ గావించి సంగీత బాణీల రూపొందించుకొని ఆయా కార్యక్రమాల్లో సంగీత కచేరి నిర్వహించారు, యీ శస్త్ర చికిత్సా

నిపుణుడు. తమ హృదయ జనిత భావనలుప్పొంగ, సుమధురగళంతో గానం చేసి అసంఖ్యాక ప్రేక్షక హృదయాలను భక్తిరసాత్మక తరంగాలలో ఓలలాడించినట్లు పలు పత్రికలు ప్రసంశలనందించాయి.

యిక కుల మత విభేదాల పట్ల వారికి గల భావనలు వెలువరచువేళ, ఒక విధమైన రౌద్ర, ఆవేశపూరితంగా తమ గళాన్ని విజృంభిస్తే, తన్మయత్వంతో, మంత్రముగ్ధుల్లాగ ప్రేక్షకులాలకించడం, ఆరసస్ఫూర్తిలోకి వారిని తమవెంట తీసికొని పోవడం ప్రత్యేకించి డాక్టరు కుదుపూడి గారి సొత్తు. కరుణ దయార్ద్రరసస్ఫూర్తి ప్రధానమైన "**1. ఎంత జాణవమ్మనీవు ఓ గోదారీ.. 2. రాదేల కరుణ నీకు రాధారమణ... 3. గోదావరి వరదొచ్చి కొంపకొట్టుకుపోనాది**"... మొదలగు గేయాల వాలపించువేళ ప్రేక్షకుని హృదయం కరిగిపోయేలాగుంటుంది. యిక వైరాగ్య పూరిత రచనలు **1. యీ బ్రతుకే ఒక అద్భుత మాయాలీల... 2. మమతల - కలతల నిలయం - యీ జీవిత మొకవలయం... 3. కనులు మూసి తెరచులోన కదలిపోయిరందరో**... వంటి గేయాలను రచయిత గానము చేయువేళ ... యీ ప్రపంచ మందేదీ శాశ్వతంకాదు అనే వైరాగ్య భావనలో మునిగిపోయి యిక తేరుకోవడానికి కొంత వ్యవధి పడుతుందనడం సత్యదూరం కాదు.

యిక జన్మనిచ్చిన కన్నతల్లికి పుట్టి పెరిగిన జన్మభూమికి మిన్నయైె స్వర్గముండేనా అనే గేయాన్ని అంకిత భావంతో ఆలపించువేళ ప్రేక్షక హృదయాన్ని అంకితభావ సంకెళ్ళతో బంధించి వేస్తారు. **1. "దేవుడు - యెక్కడో లేడురా ! మనసున్న ప్రతి మంచి మనిషిలోనే యుండెరా." 2. "ఉషోదయం అగుచున్నది నీకోసం... సోదరా నిదురమండి మేలుకో..."** మొదలగు ప్రభోధాత్మక గేయాల విన్పించువేళ ప్రేక్షకుని యెదలో, చైతన్యస్ఫూర్తిని, శక్తిని, కార్యోన్ముఖదీప్తిని రగిలించి ఉత్ప్రేరణ గావిస్తారు.

1. "యే చిత్ర కారుడు వ్రాసాడో యీ సంధ్యా రాగపు అందాలు' ' 2. "యీ అనంత విశ్వమునకు రూపకల్పన చేసిన ఆ విశ్వశిల్పి యెవ్వడో?' వంటి అద్భుత రసాత్మక గేయాలవాలపించి సంభ్రమాశ్చర్యాలను గూర్చి శ్రోతలమ్మురూతలూగిస్తారు. 1. "యీ మధుర వీణలో - యెన్నెన్ని రాగాలు వెలకొన్నవో... 2. యెన్నడు యెరుగని రసానుభూతిని కలిగించవే... 3. లేత తమలపాకులాంటి చిన్నదాన్నిరా... ఓ మామ" మొదలగు శృంగార రసాత్మక గేయాలతో - మనసును రంజింపజేసి గిలిగింతలు పులకింతలు కలిగిస్తారు.

సమాజాన్ని పట్టిపీడిస్తున్న మద్యపానసెమభూతానికి శస్త్ర చికిత్స చెయ్యాలనే తలంపుతో తమ కలానికి పదునుపెట్టి గళాన్ని యెక్కుపెట్టి,

మద్యపాననిషేధ ఉద్యమం, సంగ్రామంలో వాడవాడలు గ్రామ గ్రామాలు తిరిగి, అనేక సభల్లో సమావేశాల్లో ప్రసంగించి, ప్రజలను చైతన్య వంతులను చేశారు, చేస్తున్నారు. యీగేయాలు ప్రతివారి హృదయాలను మేల్కొల్పుతాయనేది నిస్సందేహం.

**1. నృత్యం:** అనే గేయాన్ని వ్రాసి అనునిత్య జీవన పథ గమనంలో నృతం ఉంది సత్యంగా అన్నారు.

**2. సంగీతం:** గేయంలో సంగీతము ఒక రససాగరం మానసక్షేత్రాల్ని త్రుటిలో హరించివేసి యొసగిన అద్భుత వరమని అద్భుతంగా వివరించారు.

**3. జీవితం:** ఒక చదరంగం నాటక రంగం విశ్వశిల్పి యొనరించిన కరుణామయ అగాధం. ("Kind Cruelty") అంటూ జీవితత్వానికి అర్థం పడుతూ వెలువడిన ఒక గంభీర ఆలోచనా తరంగం అది.

**4. కవిత అంటే:** అనే గేయంలో కవిత యెలా వుండాలో యెలా వుంటే సార్థకం చెందుతుందో నిర్వచనం చేసి ఒక మార్గాన్ని ప్రయోజనాన్ని నిర్దేశించారు.

యీ చంద్ర కిరణాల గేయ సంపుటిపై విషయాలను గాని, సమీక్షను గాని వ్రాయాలంటే యీ పుస్తక పరిధి చాలదు. ఒక మహా గ్రంథమే అవుతుంది. కడపటి మాటగా 1. **"ప్రియ భారతదేశమా - స్వతంత్ర మాతృదేశమా - స్వాతంత్ర్యం - సమానత్వం నిజముగ సిద్ధించిందా ?"** అనే గేయాన్ని గుండె గొంతుకల నుండి, ఆవేదనతో ఆందోళనతో డాక్టరు గారు గానం చేస్తూయుంటే హృదయం కంపిస్తుంది. గద్గదమవుతుంది. 2. **"కులమతభేదాల చిచ్చు రగులుతున్నది ! ఒడలు కాలి భరతమాతకుములుతున్నది !!... 3. యెచటికి పోతున్నది యేమవుతున్నది? దేశం మన భారతదేశం."** అనే గేయాలలోని పద జాలం భావం, ఆవేశం, ఆవేదనలతో డాక్టర్ కుడుపూడి గారు గానం చేస్తూయుంటే హృదయం బరువెక్కి ఆందోళనా భరితమై కలచివేసినట్లవుతుంది.

**సమాజాన్ని వివిధ కోణాల నుండి పరికించి పరిశీలించి, అన్నివర్గాల సమస్యలను జీర్ణింప జేసుకొని అనుభవాల సమ్మేళన నుండి వెలువడిందీ గ్రంథం. అటు కడలిని జలాంతర్భాగాలను పరిశీలించి పుడమిని పుడమిపై వెలసిన మనుజకోటిని, సకల చరాచర ప్రకృతిని సందర్శించి, పలుకరించి వింగికేగి సూర్యచంద్రుల పరికించి, అనంతవిశ్వాంతరాళంలోని నక్షత్రమండలాల్ని మారుమూలల్ని గాలించి చూసి, ప్రభుని - విభుని పరమేశ్వరుని గాంచి' రవిగానని చోట్లెల్ల ఒక**

కవిగా మనో నేత్రముతో దర్శించి, యెన్నో విషయాలను భావాలను రచయిత మనముందుంచారు.

యిక యీ గ్రంథాన్ని అందలి గంధాన్ని ఒక తృటిలో ఆకళింపు చేసుకోడానికి వీలుగా వ్రాయబడిన "Key Song" సూత్రధారగేయం.

కిరణాలు - చంద్రకిరణాలు - సుధా మధుర తరంగాలు నిజంగా సుధనుచిందుచున్నవి !

తిమిరపటలహరణాలుగ అంధకారాన్ని హరిస్తున్నవి!!

జ్ఞానామృత విహంగాలుగా అమృతాన్ని పంచిపెడుతున్నవి!!! మలయపవన వీచికలుగ హాయిగా మత్తుగా శరీరాన్ని స్పృశిస్తున్నవి. హృదయవీణ ప్రకపంనలుగ - హృదయ వీణను మీటే రాగాల తేలించుచున్నవి. పరమేశ్వర అమల విమల దరహాసాలుగ అలరించుచున్నవి. నిత్యం జరిగే సాంఘిక సంఘర్షణలకు సర్వసాక్షి ప్రత్యక్షసాక్షీ భూతుడైన చంద్రుని లాగ యీ గేయాలు సాక్షీభూతమై భువిపై వెలసిన సకల ప్రాణికోటిపై పక్షపాత రహితంగా తరతమ తారమ్యం లేకుండా చంద్రుని కిరణాల రీతి అన్ని సమస్యలను స్పృసిస్తున్నాయి. నివేదనలై వేదన నిర్మూలనలై అలరారుతున్నాయి. యింతటి సారూప్యంతో ఒకే ఒక్క గేయంతో యీ పుస్తక మందలి సమస్త సారాన్ని అందించగలగడం తపఃసమాధిలో తప్ప యే యితర పరిస్థితులలో రచన చేయుట అసాధ్యం. అట్టి యీ రచయితకు సహస్రాధిక అభినందనలర్పించకుండా యుండలేను. యిక రసహృదయులగు పాఠకులు ముందుకేగి పరిశీలింతురుగాక !




నమస్తే

ఇట్లు

**శ్రీ మల్లాది సూర్యనారాయణ, B.A.**

నాటక రచయిత, నటుడు, దర్శకుడు

మరియు నటరాజ కళాపీఠం

వ్యవస్థాపకుడు, తాడేపల్లిగూడెం

# చెప్పాలంటే చాలా వుంది
# (అయినా క్లుప్తీకరిస్తా)

చాలా Hard Industrious మెడికల్ స్టూడెంట్‌గా నాకు 1955 నుండి పరిచయస్తులు డాక్టర్ కుదుపూడి సత్యనారాయణగారు ఎందుకంటే నేను, ఆయన ఆంధ్రా మెడికల్ కాలేజీ విశాఖపట్నంలో "క్లాస్‌మేట్స్" గనుక.

1955-60లో ఎం.బి.బి.ఎస్. చదివాం. తరువాత House Surgeon Training పూర్తయిన తరువాత యిక యెవరితోవ వాళ్ళదే. ఆ లోపలో ఆయన 1962లో మెడికల్ ఆపీసరుగా ప్రభుత్వ సర్వీసులో చేరేరు. 1964లో మరల ఆంధ్రా మెడికల్ కాలేజీకి వచ్చి D.G.S. అని సర్జరీలో స్పెషలైజేషన్ చేసేరు. నాటి నుండి అనేక పెద్ద తాలూకా ఆస్పత్రులలో మెడికల్ ఆఫీసరుగా నెల్లూరు జిల్లా నుండి విశాఖపట్నం జిల్లా వరకు. కావలి - అనకాపల్లి - తుని - కపిలేశ్వరపురం - ఆలమూరు - తాడేపల్లిగూడెం, కొవ్వూరు, తణుకు - నర్సాపురం హాస్పిటల్స్‌లో అనేకానేక సంక్లిష్ట ఆపరేషన్లను సైతం అవలీలగా, సమర్థవంతంగా, వేరే యింకొక రెండవ డాక్టరు అసిస్టెన్సు లేకుండ కేవలం ఒకరిద్దరు స్టాపు నర్సెస్ సహాయంతో మాత్రమే "ఎనస్తీషియా' ' కూడ తామే యిచ్చి తాము చేసిన వేలాది ఆపరేషన్లలో యే ఒక్క కేసు కూడా ఫెయిల్ కాకుండ, ప్రమాదానికి గురికాకుండా చేసిన ఘనత నా మిత్రుడు డాక్టర్ కుదుపూడి సత్యనారాయణగారిది అంటే నమ్మశక్యము కాకపోవచ్చు. ఆశ్చర్యం కావచ్చు. అద్భుతం కావచ్చు. కాని యిది నిజం.

యీ విజయాలకు కారణం దైవకృపయని ఆయనంటాడు. కాని ఆయన అవలంబించిన ప్రత్యేక టెక్నిక్ సర్జరీయందలి ఆయన నైపుణ్యం శ్రద్ధ ఆపరేషన్ తరువాత జరుగవలసిన Post Operative Care ఏవైన కాంప్లికేషన్ వస్తే వాటిని వెయ్యి కళ్ళతో కనిపెట్టగలిగే నిశితమైన నేర్పు,

వాటిని సమర్థతతో పరిష్కరించగలిగే ఓర్పు నామిత్రునిలో ఉండడమే అట్టి ఘనమైన సర్జికల్ ఫలితాలు యివ్వడానికి కారణమని నేను సగర్వంగా చెప్పగలను. యిందు పిసమంతైనా అతిశయోక్తి లేదు.

. అందుకే ఆయన పని చేసిన అన్ని ప్రాంతాలలోని ప్రజలు ఆయనను ఒక గొప్ప 'సర్జన్'గా గుర్తించారు. యెన్నో సార్లు యెన్నో దినపత్రికలు వీరి చాకచక్యమైన ఆపరేషన్లను ప్రసంశిస్తూ అభినందిస్తూ వార్తలు వెలువరచినాయి. వాటినన్నింటిని గూర్చి వ్రాయాలంటే యిక్కడ చోటు చాలదు మన్నించాలి.

ఆపరేషన్లు చెయ్యడమంటేయే ఒక్క విభాగానికో, స్పెషాలిటీకో చెందిన వాటిని నిర్వహించడం కాదు. శరీరంలోని సమస్త అవయవాలకు (మెదడు, నేత్రములు తప్ప) చెందిన ఆపరేషన్లు, "గైనిక్ (స్త్రీ అవయవ సంబంధిత) జనరల్ యురాలజీ, గేస్ట్రో ఎంటరాలజీ, ఇ.ఎన్.టి. ఆర్థోపెడిక్ (ఎముకలు) ప్లాస్టిక్ సర్జరీ వగైరా అనేక విభాగాల ఆపరేషన్లు 'బ్లడ్ బేంకు" లేని చోట "లేబరేటరీ" సదుపాయాలు లేనిచోట మత్తువిభాగం 'ఎనస్తీషియా' డాక్టర్లు యింకా యితర అసిస్టెంట్ డాక్టర్లు లేని తగినంత నర్సింగు సిబ్బంది యితర సిబ్బంది లేని తాలూకా ఆసుపత్రులలో సాహసోపేతంగా విజయవంతంగా నిర్వహించగలగడం సామన్యమైన విషయమా ? కాదు. కానే కాదు.

అంతే కాదు భావితరాల స్ఫూర్తి కోసం తాము ఆపరేషన్ చేసి తొలగించిన వ్యాధి గ్రస్థమైన కంతులను, భాగాలను (కొన్ని వందలు) పీపాలలో వేసి ద్రావకాలు వేసి భద్రపరచియుంచడం, వందలాది ముఖ్య ఆపరేషన్లకు సంబంధించిన అనేకానేక "ఫోటో" లు తీసి వాటిని భద్రపరచడం ఒక అసాధారణ విషయం.

యివి యిట్లాగుంచి తమ 33 సం॥రముల అనుభవాలను జోడించి

# డాక్టర్ కుడుపూడి రచనలు

## A. ముద్రితములు

1. ఉదయ కిరణాలు (గేయ కావ్యం)

2. కులంతో కొలతలు

(సాంఘిక అసమానతలపై, అస్పృశ్యత కులవ్యవస్థలపై ఒక సంచలనాత్మక పద్యగద్య కావ్యం)

3. శస్త్రచికిత్సా చంద్రిక :

కొన్నిప్రాణాంతక వ్యాధులనుండి రక్షించుకొనుటకు జన సామాన్యాన్ని జాగృతపరచుటకు, కొన్ని శస్త్ర చికిత్సా సంబంధిత వ్యాధులపై ప్రాధమిక వివరణలతో తెలుగులో వెలువడిన ప్రప్రధమ గ్రంధం

## చిరు పుస్తకములు

1. గోపాలకృష్ణయ్య - గేయసంపుటి (గే॥ సం॥)
2. శివానందలహరి గేయసంపుటి
3. శ్రీరామగీతావళి గేయసంపుటి
4. ఇందిరమ్మ గేయసంపుటి
5. రాజీవ్‌గాంధీ గేయసంపుటి

## B. అముద్రితములు

1. డెలివరీ టేబుల్ 'హాస్యనాటిక)
2. మధుపాన పిశాచి (త్రాగుడుపై నాటిక)

శస్త్ర చికిత్సా సంబంధిత వ్యాధుల గురించి తెలుగులో ఒక గ్రంథాన్ని ప్రచురించి యిచ్చారు, సమాజానికొక కానుకగా. యిందలి ముఖ్యోద్దేశం ఎక్కువ చదువురాని వాళ్ళను, జన సామాన్యాన్ని ప్రభావితం చెయ్యడానికని కేన్సరు వంటి అనేకానేక ప్రాణాంతక వ్యాధులనుండి ముందుగా మేల్కొనే విధంగా చెయ్యడానికి, తాము (కుదుపూడి) ఉన్నా లేకున్నా సమాజానికి యేదో కొంత ఉపకరించే కార్యక్రమం చేసిపోవాలని ఆయ అన్నారు. యిది తెలుగులో శస్త్ర చికిత్స సంబంధిత వ్యాధులపై వెలువడిన ప్రప్రథమ గ్రంథం అగుట గమనార్హం. యిందుకొరకు డాక్టర్ కుదుపూడిగారు యెంతో ధనాన్ని శ్రమను వెచ్చించారు.

సాత్వికత మంచితనం యున్న మన మిత్రునిలో మొండితనం కాఠిన్యం కూడ నిండియున్నాయండోయ్. అవి, కానిపనులు చెయ్యమంటే అవినీతికర కార్యాలు చెయ్యమంటే బహిర్గతమవుతుంది. తాను ప్రభుత్వమెడికల్ ఆఫీసరుగా యున్న కాలంలో 'మెడికో లీగల్ కేసులకు' "పోస్టుమార్టం" కేసులకు సంబంధించి రకరకాల అభ్యర్థనలు వచ్చేవి. కేసులను తారుమారు చెయ్యించటానికి యెంతటి ధన ప్రలోభం చూపించినా యెంతటి అధికారులు, రాజకీయ నాయకులు, తమపై ఒత్తిడులు తెచ్చినా లెక్కచెయ్యక ఆత్మసాక్షిని మాత్రమే నమ్ముకొని పీసమంతైనా అసత్యానికి తావివ్వని డాక్టరు సత్యనారాయణగారు చివరకు యీ **"ఆత్మసాక్షిని వదులుకోలేక తమ పదవిని అధికారాన్ని వదలి, త్యజించి, స్వచ్ఛందపదవీ విరమణ గావించారు." 1990 నవంబరులో.** యిప్పుడు అమలాపురంలో 'నర్సింగ్ హోమ్ నెలకొల్పి వైద్య సేవలందిస్తున్నారు. ధనార్జనపై ధ్యాస లేకుండ సమాజ సేవకు అంకితమైయున్నారు.

యిక యింత వరకు వైద్యరంగం aspect (భాగం) గురించి తెలియజేసింది, నాణానికి బొమ్మా బొరుసు భాగంలో ఒక భాగం గురించే. రెండవ భాగం గురించి నేను యెక్కువగా కాకున్నా యెంతో కొంతయినా

చెప్పుకుంటేవాకు తృప్తియుండదు. నిజానికి యెక్కడో నూటికి కోటికి గాని తెలుసు, మా డాక్టర్లకు అంతరాదనుకోవాలి. ఆ వర్గంలో సాహితీ పరిమళం అబ్బడం దానికి సంగీతం కూడా తోడైయుండడం ఒక ఆశ్చర్యకర, ఆశక్తిదాయక విషయమని మీకు నేను వేరే తెలియజేయనవసరం లేదు. యిప్పటికే చాలా యెక్కువగా వ్రాసానని, మీకు కొంత విసుగు పుట్టించేనని భావించకండి ఒక్క ముక్కలో చెప్పేస్తున్నా మరి

## డాక్టర్ కుడుపూడి సత్యనారాయణగారు
## "సర్జరీ, సాహిత్య - సంగీతాల
## సమన్వయం !
## ఒక త్రివేణి సంగమం !!"

ఇక ఉంటాను. శెలవు, ఇట్లు



**డాక్టర్ వై. సన్యాసిరావు M.B.B.S., M.D.**

కన్సల్టెంట్ ఫిజిషియన్ మరియు

కళాదర్బార్ సాంస్కృతిక సంస్థ అధ్యక్షులు, రాజమండ్రి.

# ఒక వైద్యాలయంగా - విద్యాలయంగానే గాక ఒక దేవాలయంగా కన్పించే నర్సింగ్ హోం

చిరకాల పరిచితులైన యీ పుస్తక రచయిత డాక్టర్ కుడుపూడి సత్యనారాయణగారి గురించి ముఖ్యంగా నేను ఒక డాక్టరుగా, వైద్యపరమైన విషయాలు మరియు వారి నర్సింగ్ హోమ్ గురించి విషయాల్ని మీ దృష్టికి తీసుకువస్తే బాగుంటుందనుకుంటున్నాను.

ఆయన స్వచ్ఛంద పదవీ విరమణ గావించిన తరువాత శ్రీ కృష్ణా నర్సింగ్ హోంను అమలాపురంలో స్థాపించి తమ సేవలందిస్తున్నారు. యీ నర్సింగ్ హోమ్‌లో అడుగుపెట్టీ పెట్టగానే 6 1/2 అడుగుల నిలువెత్తు శ్రీ కృష్ణ పరమాత్ముని సుందరదివ్యమంగళవిగ్రహం సాక్షాత్కరిస్తుంది. ముఖచిత్రంలో రూపొందించబడిన ఫోటో ఆవిగ్రహమే యింత సుందర విగ్రహాన్ని నేనెక్కడ చూసియుండలేదు. రకరకాల Angles (స్థానాల)



నుండి రకరకాల భావనలు ఆ విగ్రహంలో కన్పిస్తాయి. అది నిజంగా ఒక సజీవశిల్పమే మరి.

ఆ వనమాలి విగ్రహం చుట్టూ నర్సింగ్ హోమ్‌లో ఒక ప్రత్యేకమైన ఉద్యానవనం : రకరకాల అందమైన పూలమొక్కలతో కన్నుల పండుగగొల్పుతుంది. డాక్టరు గారు స్వయంగా యీ మొక్కలకు సంరక్షణ చేయడం ఆయన దినచర్యలలో ఒక భాగం. మీకెందుకింత శ్రద్ధ అని అడిగితే "యీ వనమాలి కృష్ణుని తోటలో నేనొక తోటమాలిగా పనిచేస్తూ ప్రకృతిని ఆరాధిస్తాను." అంటారాయన

మరియొక ప్రత్యేక ఆకర్షణ అనే కంటె ఆశక్తి కర విషయం. సర్జరీ, మ్యూజియం : వీరు గత 33 సం॥రముల సర్జరీ అనుభవంలో ప్రక్రియలలో ఆపరేషను చేసి తొలగించిన కొన్ని కొన్ని వ్యాధిగ్రస్థమైన అవయవాలు. కంతులు తదితరములైన వానివి, కొన్నివాటిని, ద్రావకం వేసిన వందలకొద్దీ సీసాలలో యుంచి పొందుపరచారు. వీటిని చూసి వెళ్ళడానికి విద్యార్థులు, యితరులు చాలామంది వస్తుంటారు. ఆశక్తికరంగా చూస్తారు. యీ సీసాలు నర్సింగ్ హోమ్‌లో కొన్ని అద్దాల బీరువాల్లో పెట్టియుంచారు. వీటిలో ముఖ్యంగా 1. గర్భకోశము నుండి వివిధ పొరలలో ఉద్భవించిన రకరకాల కంతులు కడు ఆశక్తిని గొల్పుతాయి. 2. అండకోశము (Ovarees) నుండి పుట్టిన కంతులు 3. "ప్రోస్టేట్ కంతులు (వయసు పెరిగిన మగవారి మూత్రపు సంచి వద్ద పుడతాయి 4. మూత్ర సంచి నుండి తొలగించబడిన రాళ్ళు 5. 24 గంటల నొప్పి కల్గించు "ఎపెండిక్సు"లు 6. తొలగించబడిన టాన్సిల్సు 7. శరీరమందలి తదితర భాగాల నుండి అనేకరకాల కాయలు (Tumours) 8. పెద్ద పెద్ద బోదకాళ్ళకు ఆపరేషన్ చేసి తొలగించిన కొన్ని కెజిల బరువుండే ఫైలేరియా టిష్యూస్ వంటివి యెన్నో చూడవచ్చు.

యింకా ఎన్నో అద్దాలు కట్టిన ఫోటోలు: ప్లాస్టిక్ సర్జరీ చెయ్యబడిన గ్రహణం మొర్రు - రకరకాల హెర్నియాలు వగైరాలు డాక్టరు గారు చేసిన

అనేక సంక్లిష్ట ఆపరేషన్లు అనేక సార్లు పత్రికలలో అభినందనలతో వెలువడిన ఫోటోలు కనిపిస్తాయి గోడలపై వ్రేలాడుతూ.



అంతేకాకుండా గోడలపై వ్రేలాడే ఫోటోల్లో కొన్ని సంగీత సాహిత్య సభలకు చెందినవి వుంటాయి. యిక ఫోటోలు కాకుండా అనేక చెక్క బోర్డులపై వ్రాయబడిన భక్తి ప్రభోదాత్మక నినాదాలు, మద్యపాన వ్యతిరేక, కుల మతాలపై నినాదాలు దర్శనమిస్తాయి. మొత్తంపై యీ నర్సింగ్ హోమ్‌ను సందర్శిస్తే



ఒక వైద్యాలయమే కాదు
ఒక విద్యాలయంగా భాసిస్తుంది!
వైద్య, విద్యాలయాల లాగే గాక
ఒక దేవాలయంగా కూడా కన్పిస్తుంది !!

ఇట్లు

**డాక్టర్ డి. రామరాజు**
M.B.B.S., F.C.C.P. F.C.G.P.
శ్రీరామా నర్సింగ్ హోమ్, రావులపాలెం

# రచయిత మనస్తత్వం - అభిరుచులు అలవాట్లు - వగైరా

విభిన్న మనస్తత్వాలు గల మనుష్యుల సంగమమే యీ సమాజం. కొందరికి కొన్ని కొన్ని అభిరుచులు. ధనార్జనయే ముఖ్యం చాలా మందికి. 1. కొందరికి తమతమ తనువుల్ని సుఖింపజెయ్యడం మాత్రమే (బొందే కైలాసంగా భావించి) ధ్యాస. 2. కొందరికి తమ సుఖం, భార్యా బిడ్డల కుటుంబ సభ్యుల సౌఖ్యానికే అది పరిమితం. 3. మరి కొందరికి ఆ రెండవ కోవ పరిధిని దాటి సమాజంలోని ప్రతి యొక్కరి క్షేమాన్ని ఆశించి జీవించడంపైన మాత్రమే ధ్యాస. మన రచయిత డాక్టర్ కుదుపూడి సత్యనారాయణ గారు అందరి క్షేమం పట్ల ఆశక్తి చూపుతూ వారి సేవలో సడుస్తూ యుండడమే ఆయనకు ఆనందం.

ఆనందమనేది కేవలం ఒక మానసిక అనుభూతి మాత్రమే 1. కొందరికి కూర్చొని అదే పనిగా తింటూ ఉండడం ఆనందం. 2. కొందరికి యితరులు కష్టాలతో బాధలతో అలమటిస్తూ యుంటే చూస్తూ యుండటం ఒక (పైశాచిక) ఆనందం 3. మరి కొందరికి అవిశ్రాంతంగా పనిచేస్తూ, శ్రమిస్తూ, యితరులకు సేవలందిస్తూ యుండుట ఆనందం. యీ 3 వ పరిధికి చెందిన జీవన విధానమే డాక్టర్ కుదుపూడి గారిది. యీ సందర్భంలో ఒక ఇంగ్లీషు కోటేషన్ ఉటంకించాలనుకుంటున్నాను. అది

**"They alone live, who live for others !**
**The others are more than dead than alive !!"**

తమ జీవిత పర్యంతం - ఒక యంత్రంలా పనిచేస్తూ రోగులకు శారీరక రుగ్మతల్ని సరిచెయ్యడానికి రోగగ్రస్తమైన సమాజానికి, సమాజ వ్యవస్థకు తమ కలంతో - రచనలతో చికిత్స చెయ్యడానికి పూనుకున్న డాక్టర్ కుదుపూడి సత్యనారాయణగారు 1937 వ సం॥రంలో

శ్రీ శివరామదాసు గారు శ్రీమతి సౌభాగ్యమ్మ గార్ల ప్రధమ సంతానం. పేరెపల్లి గ్రామం, అమలాపురం తాలూకా తూర్పుగోదావరి జిల్లా వారి జన్మ స్థలం. వీరి హైస్కూలు మరియు కళాశాల విద్యాభ్యాసాలు అమలాపురంలో జరిగాయి. 1955 - 60 సం॥రాలలో ఆంధ్రా మెడికల్ కాలేజీ, విశాఖపట్నంలో ఎమ్.బి.బి.ఎస్., మరియు 1964 లో సర్జరీ స్పెషలైజేషన్ డి.జి.ఎస్. అదే మెడికల్ కాలేజీలో జరిగాయి. 1962 సం॥నుండి 1990 వరకు ఆంధ్రా వనిలో అనేక తాలూకా "హాస్పిటల్స్" లో పనిచేసి వేలాది రోగులకు సేవలందించి ప్రముఖ శస్త్ర చికిత్సా నిపుణులుగా పేరు ప్రఖ్యాతులార్జించారు.

ఒక నియమయుత, సిద్ధాంతపరమైన జీవితానికి అలవాటు పడియుండడం మన రచయిత డాక్టర్ కుడుపూడిగారి అలవాటు 1. ఓర్పుగా నేర్పుగా సేవలందించడం 2. నిరంతర పరిశ్రమ 3. అవినీతికర కార్యక్రమాల పట్ల, దురలవాట్ల పట్ల తీవ్ర వ్యతిరేకతయే కాక, చూచి సహించలేకపోవడం వాటి పట్లమధనపడడం వారి నైజం. 4. యిక వ్యక్తిగతమైన అలవాట్లు కూడా యెంతో ఆదర్శప్రాయమైనవి.

ఆర్థిక స్థోమత, అధికారం, యున్నవారు (లేనివారు కూడా) అనేకానేక వ్యసనాలకు బానిసలై, విశృంఖలంగా, విలాసంగా, నాగరికత? అనే పేరుతో కాని తెచ్చుకుంటున్న దురలవాట్లు యెన్నో ! యెన్నో....

కాని వీరు జీవితంలో యెన్నడూ (ఒక్కనాడైనా)

a. మద్యము (త్రాగుడు) తాగలేదు.

b. సిగరెట్లు వగైరాలు కాల్చలేదు.

c. పేకాట, జూదము మొదలగు వ్యసనాల జోలికి పోలేదు.

వీరు పనిచేసిన ప్రతీచోట, ప్రముఖ సర్జనుగా, నిపుణునిగా మంచి డాక్టరుగా పేరు ప్రఖ్యాతులు గాంచినా, ప్రజామన్ననలను చూరగొన్నా అధికారుల మన్ననలను, ఆశీస్సులను, అంతగా పొందలేదు. కారణం ఆపై (3)అలవాట్లు లేకపోవడం. అటువంటి అధికారులతో కలిసి మెలసి గంతులు వెయ్యక పోవడం.

28 సం॥రముల రేయింబవళ్ళు సమాజానికి వైద్య సేవలందించి, రోజు రోజుకు పెరిగిపోతున్న రాజకీయ నాయకుల కుటిల, అవినీతికర, స్వార్థపూరిత అభ్యర్థనలకు (ఎమ్.ఎల్.సి.) పోస్టుమార్టంలలో) లొంగక ఆత్మసాక్షిని చంపుకోలేక డిప్యూటీ సివిల్ సర్జనుగా 1-11-1990లో స్వచ్ఛంద పదవీ విరమణ గావించారు, ప్రభుత్వ సర్వీసునుండి.

తాము నమ్మిన సిద్ధాంతాలనుండి పద్ధతులనుండి, యెంతటి అధికారులు, రాజకీయ నాయకులు చెప్పినా ఒక పీసమంతైనా వెనుకకు మరలుట యీయనకు చేతకాని పని **"Love All Fear None"** సిద్ధాంత మీయనలో జీర్ణించుకుపోయింది.

వీరి పదవీ విరమణ వార్తను అన్ని దినపత్రికలు పతాక శీర్షికలో ప్రకటించాయి.

1. "రాజీ పడలేక రాజీనామ'
   ఆంధ్రభూమి 16-11-90
2. "సేవా భావంతో సర్కారీ కొలువుకు స్వస్థి -
   ఆంధ్రప్రభ 16-11-90
3. "వత్తిళ్ళకు నిరసనగా డాక్టర్ కుడుపూడి రాజీనామ'
   ఈనాడు - 16-11-90
4. ప్రభుత్వ సర్వీసుకు డా॥ కుడుపూడి గుడ్‌బై
   "విశాలాంధ్ర' 16-11-90
5. "వత్తిళ్ళకు నిరసనగా ఉద్యోగానికి రాజీనామా"
   ఆంధ్రపత్రిక 16-11-90

యీయనకింకొక ప్రత్యేక అలవాటు. గత 2 దశాబ్దాలుగా ప్రతీ సంవత్సరం తాము పంపే నూతన సంవత్సర శుభాకాంక్షలతో యేదో

యొక సమాజహిత సందేశాన్ని వ్రాసి ముద్రింపజేసి అందరికీ పంపిస్తూ యుండడం'. నిరంతరం 'Round the Clock' "బిజీ"గా యుండే డాక్టరు సాహిత్యపరంగా అనేక గేయాల్ని రచించడం ఒక విశేషం. కేవలం గేయ రచనలే గాక చందో బద్ధమైన పద్యరచనలు కూడా కావించడం. వీరు వ్రాసిన "కులంతో కొలతలు" అనే కావ్యం అట్టిదే. (పద్య గద్య కావ్యం) సాహిత్య రచనల చేయుటే కాదు స్వయంగ దానికి బాణీ (Style) వి కూడ సమకూర్చుకొని "ఆర్కెస్ట్రా"పై మధుర గంభీరంగా పాడగలగడం. గేయాలను పాడడంలోనే ప్రజ్ఞకాక. పద్యాలను కూడ యెంతో తియ్యగా శ్రావ్యంగా పాడడం అందరికీ సాధ్యమయ్యే పని కాదు.

యిక మద్యపాన నిషేధ ఉద్యమాలలో, కులవ్యవస్థలపైన ప్రసంగాలలో ఆయన వాగ్ధాటి ఉపన్యాసం. తీవ్రతరమై ఉద్వేగంగా ఉంటుంది. యిలాగ ఒక వక్తయే గాక ఆయనలో ఒక విశిష్టమైన నటుడు కూడా దాగుండి అవసరమైనప్పుడు అప్పుడప్పుడు బైటికి వస్తుంటాడు.

యీాయనకు లలిత కళాప్రవీణ, కళాసాహితీ, ప్రపూర్ణ, అభ్యుదయ రచయిత, అభినవ శ్రీ కృష్ణదేవరాయ బిరుదాలు ప్రదానం చెయ్యడం నాకు సంతోషమేగాని అవి డాక్టర్ కుడుపూడి గారి స్థాయికి తగినవి కావని బహుముఖ ప్రజ్ఞాశాలియగు వీరికి ప్రభుత్వపరమైన యింకా పెద్ద గుర్తింపులు పెద్ద బిరుద ప్రదానములు జరుగవలెనని నా కోరిక నా విజ్ఞప్తి ఆలోచించండి మీారే



ఇట్లు

**అప్పారి నాగభూషణం**

రిటైర్డు ఎడ్మినిస్ట్రేటివ్ ఆఫీసర్

వైద్య ఆరోగ్య శాఖ, ఆంధ్రప్రదేశ్

మరియు సర్పంచ్ సిరిపల్లి గ్రామం.



డాక్టరు కుడుపూడికి 'లలితకళాప్రవీణ' బిరుదు ప్రదానము వాగ్లులో

| | |
|---|---|
| 'ఆంధ్రభూమి' డైలీ న్యూస్ | తె. 3-10-1985 |
| 'ఆంధ్రపత్రిక' డైలీ న్యూస్ | తె. 6-10-1985 |
| 'కోస్తావాణి' న్యూస్ | తె. 27-10-1985 |
| 'ఏలూరు టైమ్స్' | తె. 7-10-1985 |
| 'సమాచారమ్' | తె. 30-9-1985 |



"లలితకళాప్రవీణ" బిరుదప్రధాన కార్యక్రమానికి హాజరైన అసంఖ్యాక ప్రజానీకం.

# చెప్పాలంటే

నాకు తెలిసిన డాక్టర్ కుడుపూడి సత్యనారాయణగారి గురించి నేనెక్కువ వ్రాయాలనుకోడంలేదు. వారిలో

1. తాము వ్రాసిన భక్తి, ఆధ్యాత్మిక, వైరాగ్య, గీతాల నాలపించువేళ చూసాను "ఒకత్యాగరాజును!" "ఒకఅన్నమయ్యను!!"
2. యిక అభ్యుదయ, ప్రబోధ రచనల చదువువేళ చూసాను "ఒకశ్రీశ్రీని!!!"
3. స్త్రీల, కుల, సాంఘిక సమస్యల వివరించువేళ చూసాను "ఒకమహాకవి గురజాడను!!!!"
4. భువన విజయంలో శ్రీకృష్ణదేవరాయల పాత్రలో నటించినవేళ కనుగొంటిని అద్భుతనటనా చాతుర్యము చూపిన "ఒకఅభినవకృష్ణ దేవరాయలను !!!!!"



ఇట్లు
గాత్ర వాయిద్య సంగీతకళానిధి,
V.V.S.V. ప్రసాదరావు,
హెడ్‌మాస్టర్, M.P.V. స్కూల్,
పినపళ్ళ - ఆలమూరు మండలం.



భువనవిజయములో శ్రీకృష్ణదేవరాయలుగా డాక్టరు కుడుపూడి కొవ్వూరులో 1985 - అన్ని ప్రతికలలో అభినవశ్రీకృష్ణదేవరాయలుగా ప్రశంస

| | |
|---|---|
| ఆంధ్రపత్రిక డైలీ | తే. 6-4-85 |
| ఆంధ్రజ్యోతి డైలీ | తే. 5-4-85 |
| సమాచారమ్ డైలీ | తే. 13-4-85 |
| రత్నగర్భ డైలీ | తే. 15-4-85 |

## 4-10-1985 ఏలూరు టైమ్సు దినపత్రికలో ప్రాచీనవాక్యాలు యథాతథంగా శ్రీకృష్ణదేవరాయలు కాలాన్ని స్మరణకు తెచ్చిన భువనవిజయం

అలనాడు శ్రీకృష్ణదేవరాయలు దర్బారును మరపించేటట్లు రంగస్థలాన్ని అలంకరించుట, శ్రీకృష్ణదేవరాయలు పాత్రధారి పూర్తి ఆహార్యముతోనుండుట, కవులు కూడ పాత్రోచితంగా వేషధారణచేయుట వలన కొవ్వూరులో జరిగిన భువనవిజయం కవితాగోష్ఠికి చక్కని రసస్ఫూర్తినిచ్చింది. నాటిరాయలు కవితాదర్బారును తలపింపజేసింది.

శ్రీకృష్ణదేవరాయలను మంగళవాద్యములు మారుమ్రోగుతుండగా వైతాళికులు బహుపరాక్ పలుకుతుండగా, సుందరీమణులు పూలు చల్లుతుండగా, తివాసీపై రాజఠీవితో ప్రేక్షకులమధ్య నుండి వేదికపైకి ఆహ్వానించిన తీరు యీ గోష్ఠికి ప్రత్యేకత.

శ్రీకృష్ణదేవరాయలపాత్రను కొవ్వూరు ప్రభుత్వ ఆసుపత్రి డిప్యూటీ సివిల్ సర్జన్ డాక్టరు కుడుపూడి సత్యనారాయణ అత్యద్భుతంగా పోషించి గోష్ఠికి పరిపుష్టిని చేకూర్చారు. సంగీతంలో దిట్టయైన డాక్టరు కుడుపూడి సుమధుర సంగీతంలో ప్రేక్షకులకు వీనులవిందు చేసారు.

రాజఠీవితో హుందాతనంతో ఆ పాత్రను పోషించుటయేగాక స్వతహాగా డాక్టర్ కుడుపూడి కవియగుటచేత తమ కవితా చాతుర్యముతో అటు అష్టదిగ్గజాలను యిటు రసజ్ఞులైన ప్రేక్షకులను అలరింపజేసారు. ప్రశంసనీయంగా పాత్ర పోషణ చేశారు. ఆశుకవిత్వంతో ప్రేక్షకులను ఆకట్టుకున్నారు. శభాష్‌యనే ప్రశంశలతోబాటు "అభినవ కృష్ణరాయలుగా' ' పేరొందారు.

సాహితీపరిమళాన్ని వెదజల్లారు. రసజ్ఞులు రసాస్వాదనచేసి మరియొకసారి యిటువంటి గోష్ఠిని యేర్పాటుచేయమని సూచించారు.

శస్త్రచికిత్సలు చేయుటలో గణనీయమైన పేరొందిన డాక్టరు కుడుపూడి యీ గోష్ఠిలోపాల్గొని చక్కనికవిగా గుర్తింపబడి అటు కత్తిని యిటు కలాన్ని పట్టగల సవ్యసాచిగా భాసిల్లారు."




# డాక్టర్ కుడుపూడి గారి

## శస్త్రచికిత్స మరియు సాహిత్య

## సంగీతకళారంగ సేవలకు ప్రశంసలందిస్తున్న

## భారత మాజీ రాష్ట్రపతి

# శ్రీ శంకరదయాళ్ శర్మగారు

"పట్టుదల దీక్షయుంటే ఎక్కలేని శిఖరం లేదు.

చేరలేని ఔన్నత్యం లేదు!

యెంత పెద్దవాళ్ళనైనా ఉన్నతపదవుల్లో ఉన్నవాళ్ళనైనా ధైర్యంగా యెదుర్కొని, యెక్కడైనా తప్పవుంటే యిది తప్పు అని నిష్కర్షగా ఖండించడం ఆయన నైజం!! పుష్టికరమైన గంభీరమైన విగ్రహం! అంతకుమించిన నిగ్రహం!! విశృంఖలత్వంతో, పెడతోవనుపడుతున్న సమాజ జాగృతికోసం తపన, మద్యపానవ్యసనంతో చితికిపోతున్న కుటుంబాలు, పెరిగిపోతున్న నేరప్రవృత్తిపై ఆందోళన, ఒకనాడు ప్రముఖన్యాయవాది

నేడు ఆంధ్రప్రదేశ్ హైకోర్టు ఆనరబుల్ జస్టిస్

ఆయనే : **శ్రీ బి.యస్.ఏ. స్వామి**



# నా కృతజ్ఞతలు

ఏ రచయిత, రచనాసృష్టికైనా ముఖ్యంగా యెక్కువగా అసౌకర్యానికి గురియగునది వారి జీవిత భాగస్వామినులే. అట్లే సమయాసమయాలు పాటించక, యెప్పుడు ఆలోచనలు వస్తే అప్పుడే పెన్నుకాగితంతో కూర్చుండిపోతున్నప్పుడు కలిగిన అసౌకర్యాన్ని భరించిన నా సహధర్మచారిణి శ్రీమతి భాగ్యలక్ష్మికి నా ప్రథమ కృతజ్ఞతలు.

మొదటి నుండి నా సాహిత్య రచనలకు ప్రోత్సాహాన్ని చేయూతనిచ్చిన నా సోదరుడు హైకోర్టు జస్టిస్ శ్రీ బి.ఎస్.ఎ. స్వామి గార్కి నా కృతజ్ఞతలు. బంధు పరమైన అనుబంధం కన్న మా యిరువురి జీవన విధానాలు, అభిరుచులు, ఆశయాలు యెంచుమించు ఒక్కటి కావడం వల్ల భావసారూప్యం వల్ల యేర్పడిన ఆత్మీయతానుబంధమే మాకు గొప్పది.

నేను ప్రభుత్వ సర్వీసులో చేరినప్పటినుండి నాకు తోడు నీడలాగ ఉండి తన సహాయ సహకారాల్నందించుటే గాక తమకు పరిచయంగావించారు. నన్ను మిత్రులు శ్రీ అప్పారి నాగభూషణంగారు రిటైర్డ్ ఎడ్మినిస్ట్రేటివ్ ఆఫీసర్, డి.ఎమ్. అండ్ హెచ్.ఎస్. మరియు సర్పంచ్ సరిపల్లి గ్రామం. వారికి నా ధన్యవాదాలు.

యిక నన్ను, యీ పుస్తకాన్ని పరిచయం చేస్తూ యిందలి కొన్ని గేయాలపై వ్యాఖ్యానిస్తూ "రివ్యూ" చేసిన తాడేపల్లిగూడెం, నటరాజ కళాపీఠం అధినేత శ్రీ మల్లాది సూర్యనారాయణగార్కి నా నమస్సులు. గత అనేక సంవత్సరాలుగా, ప్రతి నెలనెలా, నేటికి శతాధికంగా సభలను, సన్మానాలను, వృద్ధకళాకారులకు ఆర్థిక సహాయాన్నందిస్తూ కళామతల్లికి సేవ చేస్తున్న వీరికి అభినందనలు.

మిత్రులు డాక్టర్ వై. సన్యాసిరావుగారు ఎమ్.డి. ప్రముఖ ఫిజిషియన్ రాజమండ్రి నా వైద్యరంగసేవలనుగూర్చి పరిచయం గావించారు. వారికి నా ధన్యవాదాలు. వీరు రాజమండ్రి కళాదర్బార్‌కు అధ్యక్షులుగా యుండి ఆనం కళాకేంద్రంలో యెన్నో సాంస్కృతిక కార్యక్రమాలు జరిపిస్తూ కళామతల్లికి శతవిధాల ప్రోత్సాహ పోషణలందిస్తున్నారు. వారికి నా అభినందనలు.

మా "నర్సింగ్ హోమ్" గురించి ఒక్కొక్కటిగా వివరిస్తూ

"వైద్యాలయం - విద్యాలయం- దేవాలయం" యీ మూడు ఒక్క చోట యిమిడి యున్నాయని ప్రశంసా వ్యాఖ్యలందించారు. డాక్టర్ డి. రామరాజు. వారు నిరాడంబరులు, స్నేహ శీలి, హృదయ పవిత్రత కలవారు, కనుక దేవాలయం కూడా గోచరించి యుండవచ్చు. వారికి నేను కృతజ్ఞుడను.

ఇక కళానిధి వి.వి.ఎస్.వి. ప్రసాదరావు గారు ప్రముఖ సంగీత కళాకారులు. వాయిద్య కళానిధి. నేను పాల్గొన్న ప్రతి సంగీత సభకు హాజరై వినియానందించడం ఆయన అభిరుచి. రసతాదాత్మ్యత ఆయనకు కొంచెం యెక్కువనే చెప్పాలి. అందుచే భక్తి భావ సముద్రంలో మునిగిపోయిన స్థితిలోను, లేక జ్ఞాన వైరాగ్య భావగీతాలాపనలోను, లేక ఒక నిశిత విమర్శనాత్మక భావప్రకటనలో నున్న, నన్ను చూసినవేళ "యిలాగనిపిస్తుంది నా కళ్ళకు" అని మహామహులతో, కొందరు కారణ జన్ములతో, నన్ను పోల్చారు. అది సమంజసం కాదు. ఆయన అభిమానం వల్ల నన్నట్లాగున పోల్చారు. వారికి నమస్కృతులు.

మా నర్సింగ్ హోమ్ ప్రాంగణంలో మధుర మనోహరమురళీధరుడు శ్రీ కృష్ణపరమాత్ముని విగ్రహాన్ని సుందరంగా సజీవంగా నా అభిరుచి మేరకు రూపు తీర్చియిచ్చిన **"శిల్ప బ్రహ్మ"** శ్రీ బండారు సాయిబాబా - (సత్యనారాయణ శిల్పకళానిలయం - కొత్తపల్లి పెరవలి మండలం) గార్కి నా ప్రత్యేక కళాభినందనలు. యీ శ్రీ కృష్ణ విగ్రహం. ఫోటోయే యీ పుస్తకానికి ముఖచిత్రంగా నిలిచింది.

పాత్రికేయమిత్రులెందరో నాకు సహాయ సహకారాలందించారు. మరియు సంగీత కళాశాల ప్రిన్సిపాల్, గూటాల శ్రీ స.చా. సాహెబ్ గార్కి వారందరికి ధన్యవాదాలు. నాకనేక రంగాలలో అండదండలందించిన మిత్రులు శ్రీ సింగులూరి బాపిరాజు (కొవ్వూరు) గార్కి కృతజ్ఞతలు. మరియు యింకెందరో అజ్ఞాతవ్యక్తులు నాకు ప్రోత్సాహమిచ్చారు. వారందరికి నా కృతజ్ఞతాపూర్వక వందనములు. యీ పుస్తక పఠనకుపక్రమించిన పాఠక మహాశయులకు కృతజ్ఞతలు. అంతే కాక నాకు అనేక విషయాలలో తమ సహకారాన్నందించిన నా బాల్యమిత్రులు శ్రీ కర్రి సత్యనారాయణగార్కి మరియు "టీచర్స్" శ్రీ బొక్కా గోపాలకృష్ణగారు, శ్రీ కడలి శివరావు గార్లకు నమస్సులు.

ఇట్లు
రచయిత
డాక్టర్ కుడుపూడి

# నా మాట

పాఠక మహాశయులకు నమస్కారం.

నేను మీకు విశేషించి తెలుపవలసిన విషయాలేమీ లేవు. కొద్ది మాటలు తప్ప. పుట్టిన ప్రతి మనిషి పొందవలసినవి, ప్రయత్నించవలసినవి నాలుగు. అవి "ధర్మ, అర్థ, కామ, మోక్షములు" అని పెద్దలంటారు. వాటన్నింటి గురించి నా యీ పుస్తకంలో వ్రాశాను. వివిధ గేయాల్లో, రకరకాల మనుష్యుల ప్రవృత్తులననుసరించి అనేక ఆలోచనాతరంగాలిందు రూపుదిద్దుకొన్నాయి.

కొన్ని కొన్ని సంఘటనలు, సంఘర్షణలను, వస్తువులను చూసినప్పుడు నా హృదయంలో జనించాయి భావాలు. భావాలతో రాగం-రాగంతో భాష - వెల్లుబికాయి. వాటిని సంకలనం చేసా. యివన్నీ యేకకాలంలో జనించాయి. వాటిని వ్రాసాను - వ్రాసినవి పాడాను - పాడుతూ వ్రాసాను. యిలా సాగాయి నా రచనలు. యీ సమాజ శ్రేయోయజ్ఞానికి నేను కూడా ఒక సమిధ నవ్వాలని మాత్రమే నా తపన.

నేను సాహిత్య పరంగా యెన్నో పుస్తకాల్ని చదువలేదు. నేను పండితుడను కాను. నాకు పాండిత్యం లేదు. కాని నేను మనుష్యుల్ని ప్రకృతిని ప్రపంచాన్ని చూసాను. చదివాను ఆలోచించాను.

నేను సంగీత విద్యను ప్రత్యేకించి అభ్యసించలేదు. నేను సంగీత విద్వాంసుడను కాను. కాని కాల క్రమేణా కొంత సంగీతం దానికదే అబ్బింది. కొంత సంగీతం భావావేశం నుండి పుట్టుకొచ్చింది. సహజ స్వభావ సిద్ధంగా, కొందరు విద్వాంసులు శాస్త్ర సంగీత సంకెళ్ళకు లోనై చాలాసార్లు భావాన్ని త్యజిస్తారు. (Sacrifice) ఆ పాటలో అన్ని భూషణాలు, అలంకారాలు వుంటాయి. కాని ప్రాణం మాత్రం లోపించవచ్చు. యిది నా అనుభవం. కాని నేను భావయుక్తంగా రసస్ఫూర్తి కలిస్తూ ఆలపించగలను. మీరు కూడా భావ మిళితమైన ఆరస స్ఫూర్తిని పొంది ఆనందిస్తారని, ఆనందించాలని నేను కోరుకుంటున్నాను. నా యీ కృషి, శ్రమ అంతా మీకేదైనా కొంచెమైనా ఆనందాన్ని ప్రయోజనాన్ని కలిగించాలనే మీరు యీ గేయాలన్నీ ఆ మూలాగ్రంగా చదివి పరిశీలిస్తే నేను ధన్యుడనైనట్లు భావిస్తాను.

ఇక సెలవు
మరియొకమారు నమస్కృతులతో
రచయిత

**డాక్టర్ కుడుపూడి సత్యనారాయణ**

# యీ గేయాల్ని ఆస్వాదించుటకు (పాడుటకు) కొన్ని సూచనలు

1. ప్రతి గేయం యొక్క లయకు నిర్దేశించ బడిన గతి వ్రాయబడియున్నది. 1. తకిట త్రిశ్రగతి 2. తకధిమి - చతురస్రగతి 3. తకతకిట - ఖండగతి 4. తకిట తకధిమి - మిశ్రగతి అనుసరించగలరు.
2. - లయ సంకేతము ఎక్కడ - వుంటాయో అక్కడ క్రియలు పడుతూ వుంటాయి.
3. * మాత్రల సంకేతము ఉదాహరణకు

| | | | |
|---|---|---|---|
| తకధిమి - | తకధిమి - | తకధిమి - | తకధిమి |
| యే చిత్ర - | కారుడు - | వ్రాసా | డో ** |
| తకధిమి | - తకధిమి | - తకధిమి | - తకధిమి |
| యీ** | - సంధ్యా | - రాగపు | - టందా - లు *** |

(డో) తరువాత ** రెండు మాత్రలు వాడాలి. అంటే 2 అక్షరాలు అక్కడ లేవు కనుక ఆ రెండక్షరాల కాలాన్ని రాగంతో నింపుకుని పిదప క్రియ వేసుకోవాలి.
యెన్ని మాత్రలు * ఉంటే అంత కాలాన్ని రాగంతో నింపుకోవాలి.

4. - * పసిమి చాయల
యిక్కడ క్రియ వేసిన తరువాత పసిమి అని అందుకోవాలి.
5. కొన్ని గేయాలకు రాగం వ్రాయబడింది. నిర్దేశిత రాగము గాక మీరే రాగాన్నైనా వాడవచ్చు.
6. తాళం - ఏక తాళం అన్ని గేయాలకు సరిపడుతుంది. యింక యితర తాళాలకు చిన్న చిన్న మార్పులు అవసరాన్ని బట్టి చేసుకోండి.
7. యీ గేయాల్ని భావస్ఫూర్తితో గానం చేస్తే, పాడే వారికి వినే వారికి యెనలేని రసానుభూతి కలుగగలదు.
8. సంగీత విద్వాంసులకే గాక అంతంత మాత్రం సంగీత పరిజ్ఞానమున్నవారు భావయుక్తంగా పాడితే కూడా రసస్ఫూర్తి నివ్వగలదు.
9. యిక సంగీత ప్రవేశము లేని వారు దీనిని ఒక లయబద్ధమైన వచనంగా చదివి యిందలి సాహిత్యాన్ని భావాన్ని ఆశ్వాదింతురు గాక!

# ప్రభో నా మది వేగిరపడుచున్నది

గేయం : చతురస్రగతి, తకధిమి

శాశ్వత - నిదురలో - మునిగే - ముందు *
నా విధి - ముగియించుకొనగ - ****
వేగిర - పడుచ్చున్నది ** - ప్రభో *
నా మది - వేగిర - పడుచున్నది** ॥శాశ్వత॥

నీ*నా - సంగిన తనువు * - నీ చరణ
సన్నిధిని - వ్రాలే - ముందు * - ****
మన్ను * - మన్నులో - కలిసే - ముందు
నీ*రు - నీటిలో - గా*లి - గాలిలో
అ*గ్ని - అగ్నిలో - కలిసే - ముందు *
నా యాత్మ - నీలో - లీ*న - మయ్యే ముందు
నా విధి - ముగియించుకొనగ
వేగిర మం*దు-చున్నది - నా మది ॥నీ నాసం॥

సమాజ - మండలి - కుళ్ళూ - కుట్రల
కులమత - మౌఢ్యాల - క్రూ*ర - కర్మల
తెగివాడుచు . . . . . . . . . . . . . . . . .

అనువిత్య - జీవిత - సంఘర్షణల *
సంఘట - నలను * - పంకలనం **
గావించి - నా*డ - నీయాజ్ఞమేరకు
అదినా - విధిగా - నెంచి . . . . . . . . . . . .
నా ** - యెదలో - నీ యాజ్ఞతో
జనియించినట్టి - జ్ఞా*న - వైరాగ్య
భ*క్తి - భావనల ***- రసమయ
సంగీత - సాహిత్య - లహరుల - మే*ళ-వింపుతొ
విరచించితివి * - గేయము - లెన్నో
యెవరికి - హితవైన - కా*కున్న***
యెవరు గ్రహించిన - యెవరాగ్రహించిన
యే కొందరైన - నా భావనల*
ఆస్వాదింతురనుచు * - నీయాజ్ఞగా
నా ** - విధియనుచునెంచి - మృత్యు - కౌగిలి
ఒరిగేముందు * - వేగిరపడుచు * - పూర్తి గావించి
ప్రచురించు - చుంటి **"చంద్ర కిరణాలు"** గేయ ప్రవంతిగ"



<u>ప్రత్యేక గమనిక :</u> యిందలి గేయాల్ని యధేచ్ఛగా మీరు వినియోగించు (పాడు)కోవచ్చును ! ముందుగా అనుమతి తీసుకొనకుండ. కాని వాటిని పాడేముందు గేయరచయిత పేరును ప్రకటించుట సత్సాంప్రదాయం! దానిని పాటింతురు గాక! అంతేకాక ప్రత్యేకకార్యక్రమముల సందర్భంలో రచయితకు సమాచారమందించిన ఆనందదాయకమగునని కూడా మనవి.

# చంద్రకిరణాలు

## (గేయసంపుటి)

## ప్రథమ భాగము

### రచన : డాక్టర్ కూడుపూడి

దేశభక్తి ప్రభోదాత్మక గేయాలు, ప్రకృతి వర్ణనలు ఆధ్యాత్మిక జ్ఞాన వైరాగ్య గీతాలు

## ప్రార్థన

సాకీ : హిందోలా రాగం

ఓం . . శ్రీ విఘ్నేశ్వరాయనమ:
ఓం . . నమో శ్రీ కృష్ణ
పరబ్రహ్మణే - నమ: . . . . .
నమో. . . వాణీ . . - వీణాపాణీ
విద్యలరాణీ . . . . - సరస్వతీ నమ: ॥నమో॥

* * * * * *

నమో. . . - భాషా విజ్ఞాన - విపంచిక . . .
శృతి కర్తా ! . . . - ఆది కవీంద్ర వాల్మీకవర్యా !!. . . .
నమో . . ఆంధ్రవాఙ్మయ - శాసనకర్త
నన్నయభట్టారకా - నమ:

నమో. . . నవకవితా. . . వైతాళికా ...
అభ్యుదయ - శంఖారావ - పూరిత
అమర గురజా . . . డ . . . - నమ:

నమో. . . ప్రియతమ - జన్మభూ. . మి. . .
నమో సకల కళా పారాణి కావనీ. . . .

నమో పుణ్య భరతమాతా. . నమోన్నమ: . . .

# చంద్రకిరణాలు

రాగం : అమృతవర్షిణి          తిశ్రగతి - తకిట

కిరణాలు * - ****** - చం *** ద్ర - కిరణా*లు
సుధామధుర - తరంగా*లు - చం *** ద్ర - కిరణా*లు
॥కిరణాలు॥

తిమిరపటల - హరణాలు * - ******
జ్ఞానామృత - విహంగాలు - . - - . . .
మలయపవన - వీచికలు *
హృదయవీణ - ప్రకంపనలు ॥కిరణాలు॥

ప్రకృతిరమ - రమణీ*య
చరణా*ల - కాభరణా-లు. . . . .
పరమేశ్వర - కరుణామయ
అమలవిమల - దరహాసా_లు . . . . . . . . ॥కిరణాలు॥

అనువిత్య * - సాంఘికసం - ఘర్షణల *
ప్రత్యక్ష * - సాక్షీభూతా_లు - . . . . .
భువి వెలసిన - సకలప్రాణి - కోటిపై *
ఒకేరీతి - ప్రసరించి - అలరించే
తరతమ ** - తారతమ్య - రహితమహిత
సంకేతా - లు ***** - వివేదనలు
వేదనవి - ర్మూలనలు * - ******
. . . . . . . . . . . . . . . . . . . . . . . . ॥ కిరణాలు॥

# కన్నతల్లికి - జన్మభూమికి

గతి : తకిట - తకధిమి

(మిశ్రచాపు) రాగం : హిందూస్తానీ తోడీ లేకముల్తాన్

జన్మ - నిచ్చిన -- కన్న - తల్లికి -- పుట్టి - పెరిగిన - జన్మ - భూమికి
మిన్న - యై ** - స్వర్గ - ముండే -- నా ?. . . . . . ॥జన్మ॥

గర్భ - కో * శ -- మం * - దు *** - నవ * - మా ** - సా * - లు***
భద్ర - ముఖ్యగ -- మోసి - మోసి * -- కంటి - పాపగ - చంటి - పాపను
ప్రో * - చి . . . . . . . .

అడగ - కున్నను - ఆక . లెరిగి * - పాల - నిచ్చి * - జోల - పా * డి
నడక - నేర్పి * - నడత గూర్చి * - చిన్ని - నలతకు - కలతనొందే
కన్న - తల్లి * - కమ్మ-నైనా -- ఒడికి - మిన్నగ - స్వర్గ - ముండే
నా * - **** - ఆ * - ** స్వర్గ - ముండే - నా ?* . . . . ॥జన్మ॥

కాల-తప్పిన - వేల - రాచిన -- కోప-గించని - పుడమి - తల్లికి
గుండె లోపలి - మమత - లన్నీ -- పొంగి - పొరలగ - గాలినీ * రు
పండు ఫలము * - ధరను-వెలసెను — తనయు వాకలి తీర్చగ ***
-యిలను - వెలసెను - తనయు - వాకలి- తీ* -ర్చగ. . . ॥జన్మ॥

దుష్టు - నైనా — శిష్టు - నైనా -- యోగి - నైనా - భోగి - నైనా !
రాజు - నైనా — పేద - నైనా -- కులము - మతము * - భేద-మెంచక
బ్రతుకు - నందు * _చావునం * దు -- సర్వ - సమముగ - ఒడిని - దాల్చే
పుడమి - తల్లికి - జన్మభూమికి - సాటి - యగునె *- స్వ * - ర్గం **

# మహామహులందరికి వందనాలు

తకిట - తకిటి , తిశ్రగతి

మానవమాం - గళ్యానికి - ధనమా * న - ప్రా * ణాల
తృణప్రాయము - గానొడ్డిన - మహామహుల - కందరికీ
వందనాలు - వందనాలు - వందనా * - లు *****  ॥మానవ॥

కవిగాయక - శిఖామణులు - శిల్పచిత్ర - కారులు **
సంఘ సంస్కర్తలు ** - మహితాత్ములు - మహాచరితు
లందరికి * - వందనాలు - వందనాలు - వందనా* - లు
. . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . .  ॥మానవ॥

మానవాళి - కెల్లరకు - సుఖమయ జీ - వనమువెరుప
యెన్నెన్నో - సాధనాల - సమకూర్చిన - మహనీయులు
శాస్త్రజ్ఞులు - వైజ్ఞానులు - కందరికీ - ******
వందనాలు - వందనాలు - వందనా * - లు ******  ॥మానవ॥

వ్యాధిగ్రస్థ - పీడితులకు - స్వస్థతనొడ - గూర్చవెంచి
విర్విరామ - కృషిలో - అహరహములు - తపియించి
మాతనప్రక్రి - యలనెన్నో - కనుగొ * న్న - మహనీయుల
కందరికీ - వందనాలు - వందనాలు - వందనాలు  ॥మానవ॥



ఆగష్టు 15 వ తేదీ 1986 స్వాంతంత్ర్య దినోత్సవ సందర్భములో కొవ్వూరు ప్రభుత్వ ఆసుపత్రిలో జాతీయ పతాకావిష్కరణ గావించిన డిప్యూటీ సివిల్ సర్జన్ డాక్టర్ కూడుపూడి

'నేడే స్వాతంత్రియ శుభదినం - మనజాతి మనుగడలో 'మహాపర్వదినం' అను దేశభక్తి గేయాన్ని రచించి గానం చేసి 'కవి సమ్మేళన గూడ యేర్పాటుగావించి విద్యార్థిలోకాన్ని జన సందోహాన్ని జాగృతపరచారు.

# స్వాతంత్ర్య శుభదినం

**తిశ్రగతి 3 వ కాలం తకిట -తకిట**

నే * దే - - - - **** - స్వాతంత్ర్య - శుభదినం
మనజా * తి - మనుగడలో -- మహాపర్వ - దినం *** ॥నేడే॥

మాతృ- దేశ శృంఖలాలు -- పటాపంచ_లైన దినం
తెల్లవాడి - దొరతనం * - తుడువబడిన_దీ దినం * ॥నేడే॥

దశాబ్దాలు - శతాబ్దాలు - తెల్లవాని - రాపిడిలో
దోపిడిలో - ****** - కృంగికుమిలి - నట్టిజాతి
స్వేచ్ఛగ ఊ - పిరిపీల్చ * - ఎందరెంద - రెందరో *
త్యాగధనులు - వీరవరులు - ధనమా * న ప్రాణా*ల
తృణప్రాయము - గా*వొడ్డి - అసువులు బా - సా*రో* ॥నేడే॥

* స్వ- తంత్ర్య సమర - దీక్షలో * - జీవితాల - త్యజియించిన
అమరవరుల - సంస్మరించి - పిన్నలార - పెద్దలార !
భరతమాత - పుత్రులార - అర్పించం - డీ ****
జోహా * రు - జోహా * రు - జో*హారు-లు **** ॥నేడే॥

# దేవుడు ఎక్కడో లేడురా

త్రిశ్రగతి - తకిట తకిట

దే ** వుడు - ఎక్కడో * - లేడురా * - ******
మనసు * న్న - ప్రతి మం * చి - మనిషి లోనె - ఉండెరా * ॥దేవుడు॥

తోటి నరుని - శ్రేయస్సును - కో * రి ** - ........
మానవాళి - సేవించిన - ప్రతివాడు - దే*వుడే
దేవుని ప్రతి - రూ * పే * ...........
మంచి యన్న - ది ***** - మాలయై * - తే ****
మాలయగుడు - వేనటించు - కులమౌఢ్యాల
నిరసించిన - కవిమాన్యుడు - గురజాడ * ॥దేవుడు॥

ఆకలి ద - ప్పిక తీర్చ * - దృఢదీక్ష - తో ****
ఆనకట్ట - లేకట్టి * - క్షుధార్తులను - అభాగ్యులను
ఆదుకొన్న - మహనీయుడు - సర్ ఆర్థర్
కా * టన్ ..................... ॥దేవుడు॥

రాయిరప్ప - లకు మ్రొక్కి - తోటి నరుని - నిరసించిన
మతమౌఢ్యాల - తునుమాడెను - వే * మన్న - ******
మోడువారి - పో * యిన * - బాలవితం - తువులకు **
పసుపు కుంకు - మలిచ్చి - వివాహితుల - జే*సి **
బ్రతుకులు చిగు - రింపజేసె - మనకందుకూ ** రి ** ॥దేవుడు॥

ముందు మాట : ప్రతి నూతన సంవత్సరానికి -నేడు -31 డిశంబరు. అనంతకాలగమనంలో ఒక సంవత్సరం అంతం - రేపు జనవరి 1 కొత్త సంవత్సర జననం. ప్రతి సంవత్సర సంవత్సరానికి అందుకోండి యివే నా శుభాకాంక్షలు.

**Dear Wish you A Happy New Year Year By Year !**
**For Years Together!! Ever and Ever For Ever!!!**




**తిశ్రగతి - తకిట తకిట**

నూ * రేళ్ళు - నీ * బ్రతుకు - లో * *** . . . . . .
గడిచింది - ఒక వత్సరం - ఒక వత్సరం . . . ॥నూరేళ్ళు॥

మం*చి*గ - నడచిన ** - చెడుగా ** - గడచిన **
గడచిన ** - దా ** నికి - వగవకు ** - . . . . . .
నీ * లోని - బిగువును సడ - లించకు * - . . . . . . ॥నూరేళ్ళు॥

రే ** పటి - రోజున ** - ఉషోదయా_న *****
నూ_తన - వ_త్సర * - శుభోదయా_న *****
నీవాకిలి - ముంగిటిలో . . . . . . . . . . . . . . . . . .
నిలుచును యె - న్నో * *** - నూ**తన - కాంతులు **
నవ్య దివ్య - ప్రభలనొసగి - నిన్నుముందు
నడిపింపగ - సిరులసిరుల - కురిపింపగ
సుఖశాంతుల - మురిపింపగ . . . . . . . ॥నూరేళ॥

నవ్యతేజ - స్ఫూర్తితో * - క్షణమైన
వ్యర్థముగా - వింపక ** - కర్తవ్యగామివై
పొగుమమున్ముందుకు * - విజయమునీ
పదములకడ . పొగిలపడి - తీ * రేను ॥నూరేళ్ళు॥

ముందుమాట :ఆదే తూరుపు కొండలపై బాలభానుడు ఉదయించుచున్నాడు




**చతురస్రగతి తక - తక - తకధిమి**

**3 వ కాలం : వసంతరాగం :**

అరుణ కిరణముల - కరుణ చల్లుచు **
అవనివేలగ - అరుదెం ** చే ఓ
ఉదయ భాస్కరా - ********
స్వా * గతం * సు - స్వా ** గతం * అరుణ॥

తిమిర పటలముల - తరిమివేసెడి
కాంతి కిరణముల - తేజమొసగెడి
యీ ****** - యిలాతలమ్మున
సుందరదృశ్యం - వీ *****
సుప్రభా * త - శుభోదయం ** ॥అరుణ॥

అదిగో కోయిల - పాటలు పాడెను
యిదిగో మా * వి - చిగురులు ముదమ్ముతో
మృదంగమును వా_యించ *****
తాళవృక్షములు - తనువులు మరచి *
తాళమువేయ * - వా * ట్యమాడెను
మయూరతతులు - ఓ ******
దినకరసార్వభౌమా ******
స్వా * గతం _సుస్వాగతమనుచు ॥అరుణ॥

నిత్యము నిలువున - వగ్నిజ్వాలల - దహింపబడుచు *
జీ_వకోటికి - సకలసృష్టికి - శక్తినొసంగే - సూర్యదేవత *
అనుగ్రహముతో అందుకొను * ము * - మా అంజలులు*** ॥అరుణ॥

# అన్నవేమన్న

రాగం : హిందూస్థానీ తోడి
2 వ కాలం, తిశ్రగతి తకిట

అన్నావే - మన్నా ** - వెన్నవంటి - మనసుతో
మన్వన్నదె - పచ్చినిజం - మన్వన్నదె - పచ్చి నిజం ||అన్నా||

భాగ్యాల * - తే * లీ * - భోగాల * - నం * ది **
కా *** మి - వైమోక్ష - గా *** మి - వై ****
జీవితమెం - తో **** - అనుభవించి - విరాగివై
అందించిన - జీవితసా - రం **** - నీ * పలుకు ||అన్న||

నీ **** - యెదనుం* డి - నేరుగా * - పై ****
కెగజిమ్మిన - జీవధార - నీ*వన్న - ప్రతి కవిత ** ప్రతి మాట . . . .
మో * సం * - లే * దు ** -వంచన ** - లేదు **
స్వార్థం** లే * దు ** - రా * గివై - విరాగివై
తో * చిన * - నిజమెల్ల * - నిర్భీతిని - ప్రకటించిన
మహాధీర - శూరుడవు * - . . . . . . . . . . . . . . . ||అన్న||

రా * యి ** - రప్పలలో - యీశునివెత-కీ *****
పాటిమనిషి - వే **** - నిరశించిన
మతములమౌ - ఢ్యం **** - కులముల జా - డ్యం ****
మట్టుపెట్టి - మేలుకొలుప
తెలుగునాట - నుదయించిన
తొలివే*గు - చుక్కవు ** ||అన్నా||

ఆంధ్రజ్యోతి

ఆంధ్రజ్యోతి మే 9, 1987 శనివారం 7వ పేజీ3బి

# డాక్టర్ కుదుపూడి గానలహరి

# డాక్టర్ కుదుపూడి గానలహరి

**ఆంధ్రజ్యోతి, మే 9, 1987 శనివారం 7 వ పేజి 3 బి-ప్రచురించిన వాక్యాలు యధాతధంగా**

సంగీతం అజరామరమైనది. భక్తి, ముక్తి సాధనకు చక్కని సాధనం. సంగీతంపట్ల అభిరుచి కలగడానికి పూర్వజన్మ సుకృతం వుండాలి. అందులోని తృప్తిని, ఆనందాన్ని అర్ధం చేసుకొని ఆ సంగీతామృతాన్ని పదిమందికి పంచియిచ్చే మనసున్న కళాకారులు అరుదు. కాని అట్టి సంగీత రసమయ హృదయంతో గీతాలు రచించి గానం చేసి పదిమందిని ఆనందపరవశులను చేస్తున్న చక్కని కళాకారులు శ్రీ డాక్టరు కుదుపూడి సత్యనారాయణ.

వృత్తిరీత్యా వైద్యులయినా ప్రవృత్తిరీత్యా గాయకునిగా, అభ్యుదయ రచయితగా పేరొందిన డాక్టర్ కూడుపూడి సంగీతంపట్ల తనకున్న మోజుతో సంగీత కళలోని మెలకువలను అవగాహన చేసుకొని, తానే సాహిత్యాన్ని సమకూర్చుకొని, స్వరకల్పన చేసుకొని, భక్తిభావాన్ని మేళవించి, గీతాలపన చేసి శ్రోతలను ఆనందరసాబ్ధిలో ఓలాడిస్తున్న అభ్యుదయ వాగ్గేయకారులు వీరు. ఇటీవల తాడేపల్లిగూడెంలో శ్రీ త్యాగరాజ గానసభ ఆధ్వర్యాన జరిగిన శ్రీ త్యాగరాజస్వామి 49 వ ఆరాధనోత్సవాలు డాక్టర్ కూడుపూడి సత్యనారాయణ కచేరీతో ప్రారంభం కావడం ఆయన చేస్తున్న సంగీత సాధనకు చక్కని గుర్తింపు.

దైవానికి, దేశానికి వందనములర్పిస్తూ తను కచేరీని ప్రారంభించి శ్రీ త్యాగరాజ స్వామికి వందనములర్పించు గీతాలాపన చేశారు.

తర్వాత "కోదండ రామయ్య కొలువున్న చోట" అనే గీతాన్ని కళ్యాణి రాగంలో కడు ఆర్ద్రతతో ఆలాపించి శ్రోతలను అలరింపజేశారు.

ఇప్పటికి ఎన్నో కచేరీలు చేసినా ప్రతి కచేరీలో కొత్తదనాన్ని సంతరించుకుంటూ, ఉత్తమ కళాకారునిగా డాక్టర్ కుడుపూడి పేరొందుతున్నారు. ఈ కచేరీలో ఒక వైద్యునిగా, రచయితగా మానవ శరీరంలో లయబద్ధంగా కొట్టుకొనే గుండె, అవిచ్ఛిన్నంగా పరవళ్ళు త్రొక్కుతూ ప్రవహించే రక్త ప్రసారం గూర్చి ఉటంకించి, సమస్త జీవకోటిలో జీవప్రవాహంలో శ్రుతిలయగతులు నిండివున్నాయని, ఆ శ్రుతిలయలు నిలచిపోయిన, జీవ ప్రవాహం నిలిచిపోవునని సంగీతము జీవవాహినికి సంకేతమనే భావనతో నిండిన గేయాన్ని తన మధుర గంభీర స్వరంలో "మధ్యమావతి" రాగంలో "సంగీతమా ! ఓ జీవవాహిని సంకేతమా" అనే గీతాన్ని ఆలాపించి శ్రోతల హృదయాలలో నిలిచిపోయారు. ఈ కచేరీలో ఈ గీతం ప్రత్యేక స్థానాన్ని సంతరించుకొంది.

'మతముల మౌఢ్యాన్ని కులముల జాడ్యాన్ని' మట్టుపెట్టడానికి 16 శతాబ్దంలోనే విప్లవ శంఖాన్ని పూరించి తెలుగునాట ఉదయించిన తొలివేగుచుక్క "వేమన్నను" అభివందిస్తూ "అన్నా వేమన్నా - వెన్నవంటి మనసుతో నువ్వన్నది పచ్చి నిజం" అనే ప్రభోధాత్మక గేయాన్ని డాక్టర్ కుడుపూడి "హిందూస్థానీ తోడి' ' రాగంలో పాడి వేమనకు నివాళులర్పించారు.

డాక్టరుగా మానవాళికి సందేశమిస్తూ పొగత్రాగడం, మత్తుపానీయాలు

సేవించడం ఆరోగ్యానికి ఎంత ప్రమాదకరమైనవో హెచ్చరిస్తూ "ఓ అన్నల్లారా... తమ్ముళ్లారా అమృతమిదియని విషమును ఏలను గ్రోలెదరు'అనే గీతాన్ని "అఠాణ" రాగంతో ఆవేశపూరితంగా ఉద్వేగంతో పాడి శ్రోతలను, వారి హృదయాలను ద్రవింపజేశారు.

ప్రేమ సందేశపూరితమైన "అందాలు చిందేటి మందార బాల" గీతాన్ని "హిందోళ" రాగంలో ఆలాపించి డాక్టర్ కూడుపూడి రచయిత, సంగీత విద్వాంసులే కాదు, రసిక ప్రియులని కూడా నిరూపించుకొన్నారు.

గత ఆగస్టులో సంభవించిన గోదావరి వరదల భీభత్సాన్ని కళ్ళకు కట్టినట్టు చూపించింది వీరు గానం చేసిన జానపద గేయం "ఓరి బాబోయ్, ఓరి దేముడోయ్ - గోదారి వరదొచ్చి - కొంప కొట్టుకుపోనాది". కేదార గౌళ రాగంలో భావయుక్తంగా యీ గీతాన్ని ఆలాపించి రసానుభూతిని కల్గించారు. ఈ కచేరిలో ఈ గీతానికి చేసిన స్వరకల్పన, సాహిత్యం శ్రోతలకు మరుపురానివిగా మిగిలిపోయాయి.

అహోరాత్రాలు నిర్విరామ వైద్యసేవలందిస్తూ శస్త్ర చికిత్స నిపుణినిగా పేరొందిన డాక్టరు శ్రీ కుడుపూడి సత్యనారాయణ సామాజిక రుగ్మతల నిర్మూలనకు, సంగీత, సాహిత్యాలనే సాధనలతో శస్త్ర చికిత్స చేయడం ప్రశంసనీయమైనది.

ప్రతిఫలాపేక్ష లేకుండా సమాజ సేవయే ధ్యేయంగా సంగీత సభలలో పాల్గొంటూ ఆధ్యాత్మిక భావపూరిత దేశభక్తియుత ప్రబోధాత్మక సందేశాలను అందిస్తూ దేశ సేవ చేయడం డాక్టరు కుడుపూడి నిస్వార్థతకు నిదర్శనం.

డాక్టరు కుడుపూడి కుమారుడు చిరంజీవి మురళి కూడా ఈ సభలో 'అరుణ కిరణముల - కరుణ చల్లుచు' అనే గీతాన్ని వసంత రాగంలో పాడి తండ్రికి తగిన తనయుడు అనిపించుకొన్నాడు.

శ్రీ బాలాజీ వేణువు, వయొలివ్‌లతోను; శ్రీ రమణయ్య మాష్టారు హార్మోనియంతోను, శ్రీ అబ్దుల్లా తబలాతోను యీ కచేరిలో సహకరించారు.

**స్పాట్ న్యూస్, కొవ్వూరు**

ముందుమాట: అల్లదే పశ్చిమాద్రిని భాస్కరుడస్తమింపనుంకించుచున్నాడు... అరుణరాగ...రంజితమై...వివిధ రాగ వర్ణవిలసితమై...అత్యంత మనోజ్ఞ మనోహరమై - నేత్ర పర్వమును గూర్చుచున్నది సంధ్యవేళ !

## యే చిత్రకారుడు వ్రాసాడో (గేయం)

అద్భుత - ఆనందరసాలు చతుర స్రగతి తకధిమి

2 వ కాలం - రాగం : శుద్ధదన్యాసి

యేచిత్ర - కారుడు - వ్రా - సాడో **......

యీ ** - సంధ్యా - రాగపు - టందా - లు ...... ॥యేచిత్ర॥

- * పసిమి - చాయలు - మిసమిస - లాడే

సంధ్యా - దేవి * - * నుదుటి - పై * న -

అరుణా - రుణ ** - రా*గ - రంజిత

రవిబిం - బమునే - తిలకము-గా తీర్చి ॥యేచిత్ర॥

కను రెప్ప - పాటులో - వేలాది - వలువల

రంగుల - హరివిల్లు - అ *** - కూ * ర్చి - మార్చుచు

మార్చి కూర్చుచు * - యెనలేని - రీతిని

చిత్రాను - భూతుల - విభ్రాంతి - గొలుపుచు ॥యేచిత్ర॥

**ముందు మాట :** సర్వమతాలు, కులాలు ఒక్కటే ! యీ సకల చరాచర ప్రపంచాన్ని సృష్టించిన సృష్టికర్త ఒక్కడే, నదులు యెక్కడపుట్టి, యెటుప్రవహించినా, చివరకు వాని గమ్యస్థానము ఆ సముద్రమే. అట్లే మతాలు యేవైనా మార్గాలు సిద్ధాంతాలు యేవైనా అవి చేర్చే గమ్యం, ఆ ఈశ్వర సన్నిధానమే. కనుక ఓ సోదరా ! ద్వేషభావాన్ని త్రుంచి, ప్రేమ భావాన్ని పెంచి మసలుకో.

# మతములన్నీ ఒక్కటేరా !

రాగం : సావేరీ, తకిట - తకధిమి, 3 వ కాలం మిశ్రచాపు

మతము - లన్నీ -- ఒక్క - టేరా
మనుషు - లంతా -- ఒక్క - టే ** ॥మత॥

ఈసు - అన్నా -- యేసు - అన్నా
రాము - డన్నా -- రహీ - మన్నా
ఒక్క - డే ** - యీ ***** - విశ్వ - మంతా
సృష్టి - చేసిన - ప్రభువు - వొక్కడే ***** ॥మతము॥

బ్రహ్మ - పుత్రా - సింధు - నదులు
గో * - దావరి * - కా - వేరీ
యెచట - పుట్టిన -- యెటుల * నడచిన
తుదకు - గమ్యము -- సంద్ర - మే **

హైంద - వం ** - క్రైస్త - వం **
బౌద్ధ - ము * మరి -- యిస్లాము **
సర్వ - మతముల -- సార - మొక్కటె
తరచి - చూడగ -- తమ్ము - డా **

సాటి - మనుజుని -- సోద - రముతో
ప్రే * - మించ * -- మన్న - వి ***
ధర్మ - మార్గము -- విడు - వక ***
సత్య - లత -- మెలగ - మన్నవి
త్యాగ - విరతిని -- పెంచ - మన్నవి
ద్వేష - భావము -- త్రుంచ - మన్నవి ॥మతము॥

**ముందు మాట:** ఓ సంద్రమా క్షణక్షణము ఉవ్వెత్తున లేచి నీ కోట్ల కోట్ల తరంగ బాహువులను చాచి, పుడమిపై పడుతుంటావు అది ప్రేమాతిశయమోదమో లేక ఉగ్రమయరణరంగ కోలాహలమో అవగతము కాకున్నది, మరినీ అంతరంగము. ఆ... అది ప్రేమాతి శయమేలే, కాకున్న పుడమితల్లి యెందుకు పులకించిపోతుంది నీ స్పర్శతో; అలింగనముతో

# పుడమి కరిగింది కడలి కౌగిలిలో

**మిశ్రచాపు గతి : తకిట - తకధిమి**

కడలి - ఒరిగిం -- దీ * - **** - పుడమి - ఒడిలో - *** - ****
పుడమి - కరిగిం - దీ * - **** - కడలి - కౌగిలి - లో * - ****
॥కడలి॥

పొంగి - పోతూ - వంగి - కెగయుచు
ఉరక - లేస్తూ -- పరుగు - తీస్తూ ॥కడలి॥

ఎన్ని - జన్మల -- ఎన్ని - యుగముల
బంధ - మోమరి - . . . . . . . . . . .
యీ * - పుడమికి - ఆ * - కడలికి
క్షణము - వీడవు - ఒకరి - నొకరు * ॥కడలి॥

రేయి - పవలు * -- యెన్న - డెప్పుడు
తెరుపు - లేనీ * - నిత్య - ఘోషలో
యెన్ని - ఊసులు - యెన్ని - బాసలు
యెన్ని - మాటలు -- యెన్ని - పాటలో
సాగు - నో ఆ -- సంగ - మంలో
. . . . . . . . . . . . . . . . . . . . . . ॥కడలి॥

# సృష్టిలో అనుబంధం

**తిశ్రగతి - తకిట - తకిట - 3 వ కాలం**

తొలకరి ** - ఝల్లుల ** - చినుకుల తాకిడితో ** 

పులకరించి - పో * తుంది - పుడమి *** - ****  ॥తొలకరి॥

భ్రమరరాజ - పరిష్వంగ - స్పర్శనలో - ******

యెదలోని - క్షిప్తమైన - మకరంద - మంత ***

చిందిం * చి కులుకుతుంది - కుసుమం ** - ******

మమ తా * నురాగాల - కలగలిపి * - ******

తనువులోని - రుధిరమంత - మధురక్షీ - రముగమలచి

కన్న బిడ్డ - చన్నుగుడిపి - పరవశించి - పోతుంది *.

మా * తృత్వం . . . . . . . . . . . .  ॥తొలకరి॥

పరశ్రావ్య - గతులతో * - స్వరజతులను - గూ * ర్చి**

వయవమనో - హారములైన - నృత్యా * ల - నందించే

కళాసృష్టి - కనులగనిన - క్షణములోన

పరవశించి - పోతుంది - ప్రేక్షక రసహృదయం

యిదే యిదే - సృష్టిలోన . వెలకొన్న చిత్రమైన అనుబంధం  ॥తొలకరి॥

# రకరకాల బొమ్మలు

తిశ్రగతి - తకిట

రకరకాల - బొమ్మలు ** - జగతిలోన - వెలసెను **
యెన్నిబొమ్మ - లుండినా * - దేని రూపు - దా * విదే ॥రక॥

ఒకేనేల - పై మొలచి * - ఒక వృక్షము- అందించెను
అమృతమగు - ఫలములు
యిం **** - కొక వృక్షము - చిందించెను - విషతుల్యపు
ఫలములు
నల్లనైన - కాకియేమొ - కావు కావు - మనుచు యరచు
కాకివంటి - కోయిలేమొ - కమ్మగ పా - టలుపాడు *
యింతేరా - సృష్టిలో * - అంతా - వైవిధ్యం ** ॥రక॥

తెల్లనైన - పాలేమో - మధురిమలొలి - కించును **
పాలబోలు - సున్నమేమొ - పెదవులమం - డించును **
ఒకే చెట్టు - కాయలు ** - ఒక్క - తీరుగుండవు **
ఒకే తల్లి - బిడ్డలు ** - ఒక్కరీతి - గుండరు **
దొంగయగును - ఒక్కడు ** - దొరయగునిం - కొక్కడు **
నాయకుడు * - ఒక్కడు * - వినాయకుడు - ఒక్కడు ** ॥రక॥

# ప్రభో నీ సృష్టి గాంచి

మిశ్రగతి - తకిట తకధిమి, 2 వ కాలం

పాకీ : (ప్రభో......జగదీశ్వరా......)

నీవు గూర్చిన - చిత్రమైన * - సృష్టిగాంచి * - పరవశిం* చ - నా *****
నీవు జేసిన - భ్రష్టులనుగా_ంచి **** - కలవరిం * చ - నా *****
॥నీవు గూ॥

అందమైన గు - లాబినంటి * - మొలచినవి ముం - ద్లు *****
మొగలి పూవుల - రేకుల * వెను - క ******
బుసలు కొట్టుచు - నాగులుండె * నీవుగూ॥

ప్ర - శాంత జలనిధి - గర్భము *** - చిన్ని చేపల - నోటకరచే
నిత్యక్షోభిత - మృత్యుకుహరం . . . . . . . . . . .
భూరి మత్స్య తి - మింగలాల - భీ * భత్స వి - హారక్షేత్రం ॥నీవుగూ॥

మంచి చెడ్డల - వరసి మెలుగగ
మేధవొందిన - నరుడు యిలలో . . . . . . . . . . .
కామక్రో * ధ - మత్సరములకు - బానిసై **
బ్రతుకు విలువను - తెలియలేక
దుర్మదాం * ధ - చిత్తుడై ** - కన్నుమిన్నే - గానక ***
ఆచరించెను - యెన్నెన్నో * - ఘోరకృత్యా - లు ****** ॥నీవుగూ॥

# ఏమిటీ ఓ స్వామి నీ సృష్టి తీరు

ఖండగతి - తకతకిట

ఏమిటి * - ఓ స్వామి - నీ - సృష్టి - తీరు ** ||ఏమిటి||

గాలిలో - ఎగురగ * - పక్షులకు - నేర్పితివి
నీటిలో - యీదగ * - చేపలకు - నేర్పితివి
సాంఘిక - జీవనం - చీమలకు - నేర్పి**
మకరంద - మేగాని * - పుప్పొడిని - ప్రసరించు
ఉభయతా_రకగుణము - తేటులకు - నేర్పితివి ||ఏమిటి||

మంచిని * - చెడుగును * - ఐక్యముగ - పంచుకొను
సమతభా - వమునే * - కాకులకు - నేర్పితివి
స్వార్థనైజ - మున *** - కాట్లాడు - గుణమును
నరునకు * - నేర్పితివి . . . . . . . . . . ||ఏమిటి||

మధురఫల - ములనీయ - మ్రానులకు - నేర్పి **
వానిని * - కడతేర్చు - తీరులను - మనుజునకు - నేర్పితివి
గడ్డి మా-త్రమెగరచి - మధురక్షీ - రములొసగ - గోవులకు - నేర్పి**
క్షీరములె - గ్రోలి ** - విషమునే - క్రక్కెడి - నైజముతొ
యిలలో ** - నరులనే - గూర్చితివి . . . . . . . . ||ఏమిటి||




**2 వ కాలం - తిశ్రగతి - తకిట**

ఓ * అమర - వీరుడా * - ఓ * త్యాగ - శీలుడా *
అల్లూ * రి - సీతరామ - రాజా ** - అందుకో*
జో * హా * - రులు . . . . . . . . . . . . ॥ఓ అమర॥

భరతమాత - దాస్య శృంఖ-లాలుద్రెంచ
తెల్లవాడి - గుండెలలో - సింహస్వప్న - మై నిలచి *
గడగడలా - డింపజేసి - ఆంధ్రజాతి - పౌరుషం *
భరతజాతి - ప్రతాపం * - చవిచూపిన - మహనీయుడ ॥ఓ అమర॥

ఎవడివాడో - యెచటివాడో - భరతావని - కరుదెంచి *
కన్నుకుట్టి - తిష్టవేసి - గుంటనక్క - జిత్తులతో
దే*శమును - కబళించి * - సంపదలను - కొల్లగొట్టి
నెత్తినెక్కి - స్వారిచేసి - పీ * డించి - క్రీడించే
కిరాతకుల మదమణచి * - పరపాలన - తొలగించగ
మన్య ప్రజల - ప్రభావితము - గావించి * - - . . .
స్వతంత్ర్య - సమరజ్వాలవై * - సమరభేరి - మ్రోగించి *
కొన ఊపిరి - విలుచు వరకు - తుదిరక్తము - చిందువరకు
పోరాటము - సాగించి * - నీ * ప్రతి * - రక్తబిం * - దువునుండి
వేలవేల - సీతరామ - రాజులుద్భ - వింపజేసి - న - . . .
ఓ మహిత - మాన్యుడ * - అందుకో * - జో * హారు - లు . . .

॥ఓఅమర॥

# ఓ కళాకారుడా

(కళారంగ స్రష్టలందరికి అంకితమీ గేయం)    తిశ్రగతి - తకిట

ఓ కళా * - కారుడా * - ****** - ******
అమృతయుత - హృదయుడా
పావనమయ - జీవనుడా !
నీవు - చిరంజీవివిరా ॥।        ॥ఓ కళా॥

శోకతప్త - జనులకు **
అంధకార - సమాజముకు
వెల్గులు ప్రస - రించుటకై
విన్న నీవు - విలువున దహి
యించుకొనుచు - ******
కాంతులు విర - జిమ్మే **
దీపకళిక - నీ * వు **
. . . . . . . . . . . . . . . . . . .        ॥ఓ కళా॥

కడుపునిండ - తిండి లేక
కంటిపైన - కునుకులేక
ఆహారహములు - తపియించి
ఆర్జించిన - నిపుణతకు
ప్రేక్షకు చిరు - నగవువే *
పెన్నిధిగా - నెం * చి **
మురిసేపం - తుష్టుడ **
తనిపే మహా - నీయుడా.*        ॥ఓ కళా॥

# అతివిచిత్రసంగమమీ విశ్వసృష్టి

**తిశ్రగతి - తకిట - తకిట 3 వకాలం**

చూసే ** - మనసుంటే - కదలాడే - హృదయముంటె
అతివిచిత్ర - సంగమమీ - విశ్వసృష్టి - నిలయము ** ॥చూసే॥

శాఖో * ప - శాఖలతో - యెన్నెన్నో * - జీవులకు *
నెలవునిచ్చి - ఫలములొసగి - ఆదరించు - వటవృక్షము
పెరగనీదు - యే చెట్టును - అది యే * మి - కర్మమో *
తన ఛా * య - లో ....... ॥చూసే॥

నిర్మల గం - భీరమగుచు - తోచుచుండు తటాకము *
నిరతర సం - క్షోభమయము - భయము ***- - - ...
భూరి మత్స్య - గహ్వరమున - మృత్యుకుహర - గవాక్షమున
క్షణముక్షణము - చిరుమత్స్య - భక్షణము * - ***** ॥చూసే॥

మమతా * ను - బంధా * ల - బంధనముల - బంధించి *
శాశ్వతమను - భ్రమలనిలను - కల్పించే * - జీవితం *
బద్బుదమగు - ప్రాయముక్షణ - భంగురము * - ******
కనులకు క - న్పించుదంత - నిజము కాదు - నిజమంతా
కండ్లకిలను - కనరాదీ - జగతిలో * - ****** ॥చూసే॥

# ఎక్కడో యీ హాయి మనిషికి

తిశ్రగతి : తకిట - తకిట

రాగము : హిందూస్థానీ తోడీ

ఎక్కడోయి - హాయి *** యిం కె - క్కడోయి - హాయి*** -
మనిషికే ** - ******
మనిషికే ** - సం **** - తృప్తిలేని - మనిషికి ** ॥ఎక్కడోయి॥

ఉదయములే - చిందిమొదలు - రాతిరి ** - నిదురలో *
మునిగేవరు - కు ***** - రెక్కలు ** - ముక్కలు **
చేసుకొని * - యేదేదో - వ్యాపకముల - తో ****
సతమతమం - దేను మనిషి - సతమతమం - దేను మనిషి ! ॥ఎక్కడోయి॥

మండే ** - కడుపును ** - చల్లార్చుట - కై ****
తినుటకు ** - తిండికొరకు - పాటులు ఒక - వంక *** !
కట్టబట్ట - ఉండవిల్లు - పొందుపరచు - కొనుటకై *
యెడతెగని * - పెనగులాట - యిం **** - కొకవంక *
॥ఎక్కడోయి॥

అన్నీ సమ - కూ ** డీ - కూడగనే - ******
మేడలు ** - మిద్దెలు ** - కావాలం - టు ****
మోజులుపడ - తా ** రు - కారులు ** - పేరులు **
కలగాలం - టూ **** - కలవరపడ - తా *** రు ॥ఎక్కడోయి॥

ముందు మాట :ప్రభు ! యిన్ని ప్రమిదలను జీవన జ్యోతులను అసంఖ్యాకంగా వెల్గించనేల, ఆర్పివేయనేల ?

# జీవనజ్యోతులు

**3 వ కాలం - ఖండగతి - తకతకిట**

యెవరు సమ - కూర్చారు - యీ ప్రమిద - లు ****?
యెవరు వెలి - గించారు - యీ జ్యోతు - లు ****? ॥యెవరు॥

కొన్ని ప్రమి - దలలోన - నిండుగా - తైలమును
కొన్ని ప్రమి - దలలోన - కొంచెమే - తైలమును
కొసరి కొస - రి * యందు - పోసినా * - రేల ** ?
సరిపోని - ప్రమిదలను - వెలిగించి - రే * ల ** ? ॥యెవరు॥

కోట్లాది - జ్యోతులను - వెలిగించ - నేల *** ?
ఘడియనడు - వకముందె - తొలగించ - నేల *** ?
వెలిగించి - జ్యోతులను - గాలిలో - విడువక *
రక్షణను - కల్పించి - నిల్పు కొన - వేల ** ? ॥యెవరు॥

నీ విశ్వ - దేవళపు - ప్రాంగణము - లో ***
విభవంబు - నొడగూర్చ - అనునిత్య - మెన్నెన్ని
జీవన - జ్యోతుల * - వెల్గించి - ఆర్పుచు *
ఆర్పి వెలి - గించుచు * - ఆడుకొం - టా వయ్య
ఓ భువన - నాయకా ? . . . . . . . . . . ॥యెవరు॥

# చితిని మండిన దేహము

చతురస్రగతి - తకధిమి

కన్నుల - ముందె * మా*య - మై * రి
ఎంత * కెందరొ - మా * న - వులు ** ॥కన్నుల॥

నిన్నటి - వా * రు - నే * డు - లే * రు
నే * టి - వారలు - రేపటి - కెందరొ ॥కన్నుల॥

నాది * - నాదని - రోదిం - చి ***
ఎందరి - నోమరి - వేధిం - చి ***
పే * క - రించిన - సంపద - విడచి *
నేను * - నావా - రనెడి * - ****
ప్రేమలు - మమతలు - సర్వము - విడచి *
ఆర్జించి - న పేరు *** - ఖ్యాతులు
సకలము - విడచి * - . . . . . . . .
- * క్షణములోనె * - మా * రు - పలుకక
- * యెచటి - కేగెద - రో . . . . . . . . ॥కన్నుల॥

- * పెదవి - పలుకదు - కా * లు - కదలదు
కన్నులు - చూడవు - చెవులు వి - నవు **
జి * హ్వా - యడుగదు - . . . . . . . . . . . . .
- * రుచుల - కొరకు * - . . . . . . . . . . .
గా * లి - గాలివి - * కలసి - పోగ *
నీ * రు - నీటివి - చే * రు - కొవగ *
- * చితివి - మండిన - దే * హ - ము ***
- * తుదకు - మిగిలెను - బూ * డి - దై **
పిడికెడు - బూ * డి - దై ** - **** ॥కన్నుల॥

# ఎవడు చేసాడురా ?

త్రిశ్రగతి - తకిట

ఎవడు - చేశాదుర ? - ఏల చేశా* దుర ** ?
యీ **** - జీవులను * - ******
చదరంగపు - పావులను * - ****** ॥ఎవడు॥

అణుక్షణం - యేదేదో - ఘర్షణ ** - . . . . . . . .
క్షణక్షణం - యేదేదో - సం **** - ఘర్షణ **
యీ **** - యవనియెల్ల - అనవరతం - నిండెరా *
ప్రతియణువు * - అణువు *** - అనునిత్యం
సంచలనం - చెందెరా * ! . . . . . . . . . ॥ఎవడు॥

బావిలోని - కప్పయొకటి - తలచెనిదే - లోకమనీ
లోకమంత - తిరిగిచూడ - తెలిసెనదీ - - . . . . . . .
అనం *** - తంబనీ * - తనకేమీ - తెలియదనీ
. . . . . . . . . . . . . . . . . . . . . . . . ॥ఎడు॥

ఒక చోటను - ప్రభవించెను * - ఒక జీవి * వే ****
రొక చోటను - మరణించెను - యింకొక జీ - వీ ****
- * అనునిత్య - మిటుల - జనన - మరణ - సంఘటనల - తో ****
జీవ చక్ర - మీరీతిని - పరిభ్రమణ - మందెనూ *
ఒకడు జనన - మందగా * - వే * రొకడు - మరణ మంద - గా ****
పెరుగలేదు - తరుగలేదు - జీవకోటి - ప్రమాణం **
కలుగలేదు - ప్రకృతికి - యెటువంటి - ప్రమాదం
ఒకడు విఙ్ఞ - మించగా * - వే **** - రొకడు అరు*దెంచగా ॥ఎవడు॥

# భ్రమలను విడచి నడవాలి

ఎండమావిలో - నీరుండేనా ?
పులికోరలలో - కరుణుండేనా ?

ఎండమావిలో - నీరు వెతుకకు
పులికోరలలో - కరుణను కోరకు

మధురిమలొలికే - పాలను చిలికే
గోవులు యెన్నడు - విషమును - చిందేనా ?
విషమును - గ్రక్కెడి - నాగులు యెపుడైన
క్షీరము లొసగేనా . . . . . . . . . . . . . .

ఏది - యెచ్చట - ఆశించాలో
యోచించి మాత్రమే - ఆశించాలి
నిజమును - అరసి * - మసలాలి ***
భ్రమలను - విడచి * - నడవాలి ***

ముందుమాట: కాగితంలాంటి ఓ మనిషి - నీవు మితిమీరి యెగసి పడకు మిడిసిపడకు. ఒక క్రమాన్ని పద్ధతిని పాటించు. నీకు గౌరవమర్యాదలు దక్కుతాయి. లేకుంటే మరి

# ఎగిరిపడకె కాగితమా (జీవితమా)

**తిశ్రగతి - తకిట తకిట**

ఎగిరి పడకె - యెగిరి పడకె - కాగితమా - ? ******
ఎగిరి మిడిసి - పడకే ఓ- కాగితమా - ? ****** ॥ఎగిరి॥

మితిమీ * రి - యెగిరితే * - నలిగి చిరిగి - పోతా * వు
అదుపుమీ * రి - కదిలితే * - అసలు లేక - పోతావు ॥ఎగిరి॥
మే జాబిల్లకు అంటి * - పేపరువై - టుకుమణగి *
నీనెలవున - నీవుంటే - - ...............
నీ విలువలు - విలచును ** - నిన్ను జగతి - కొలుచును **
అదుపు తప్పి - నెలవు విడచి - పరుగులు తీ - స్తే ****
బండలలో - ముండ్లలో * - నీటిలో నిప్పులో *
ముప్పుకు - గురియౌతావు * - ........... ॥ఎగిరి॥

నీటిలోన - నడచుచేప - నీరు విడిచి - తే ****
అడవిలోన - తిరుగుపులి * - అడవివీడి - తే ****
వారి వారి - నెలవులను * - బాసిమసలి - తే ****
మాసిపోవు - నమసిపోవు - మరచిపోవ - కే **** ॥ఎగిరి॥

**యీ గేయానికి కవితా ప్రేరణ :** ఒకనాడు టేబుల్ మీదనున్న ఒక కాగితం యెగిరి క్రిందపడింది దానిని పట్టుకుని తియ్యబోతే యెగిరెగిరి పడుతూ ముందుకు యింకా ముందుకు పరుగెత్తడం ప్రారంభించింది (గాలికి)

<u>ముందుమాట:</u> అదివరమని భావించినా లేక శాపమని యెంచినా పుట్టిన ప్రతి మనిషికీ అనివార్యమైనది తథ్యమైనది మరణం

# మరణమూ అది

**తకిట - తకధిమి - మిశ్రచాపు**

మరణ - మూ అది — శాప - మగునో *
వరమే - యగునో — చివరి - కనివార్యం * - ****. . . ||మరణ||

యూస - డింపుల — చీద - రింపుల — కోర్క - లేక *
విలువ - లేక * — నడువ - లేక *
నడుము - వంగిన — నూరు - యేం * డ్ల
ముదుస - లి ** — మొరల - విడెను *
ఓ * - **** — మరణ - మా ** -
శీఘ్ర - తరముగ — దరికి - చేరి *
వ్యథల - నుండి * — ముక్తి - నిమ్మని ||మరణ||

విండు - యవ్వన — శోభ - లందున
తేలి - యాడి * — బ్రతుకు - తీపిని
చూర -గొనగ * — . . . . . .
కలల - వెన్నో — పెంచు - కొన్న *
నవ్య - సుమములు — రాలె - వెన్నో
పూర్తి - గమ్యము — చేర - కుండనె ||మరణ||

యెప్పు - డెచ్చుట — యెటుల - వో మరి
యెరుగ - కుండగ — పగిలి - పోయె *
మట్టి - కుండలు — నీటి - బుడగలు
జీవి - తాలు * - - . . . . . . . . . . . . . . ||మరణ||

ముందుమాట: ఎందరో ఆశ్రితులకు, ఆ పన్నులకు రక్షణనిచ్చి సహాయము చేసి, పోషించి పెంచి నేడు నిస్సహాయ స్థితిలో యున్న ఒక వృద్ధుని విలాపము)

# చిగురులు తొడగని మోడుయిది

**తకధిమి - చతురస్ర గతి - 2 వ కాలం**

చిగురులు - తొడగని - మో * డు - యిది **
స్పందన - లే * వి - రా * యి - యిది ** ॥చిగురు॥

ఎన్నో * - మారులు - చిగురులు - తొడిగి *
ఎన్నో - పూవులు - పూ * చి - పూ * చి
ఎన్నో - ఫలములు - అందిం - చీ **
చివరకు - మోడుగ - మారిన - దీ ** ॥చిగురు॥

- * దరివి చేరిన * - ఆశ్రిత - కోటికి
ఎండకు - వానకు - రక్షణ - నొసగి *
తనకే - రక్షణ - కోల్పో - యి ***
చివరకు - మోడుగ - మారిన - ది *** ॥చిగురు॥

# కాలచక్రము నిలువదు

**మిశ్రచాపు - తకిట - తకధిమి**

**2 లేక 3 వ కాలం**

ఎల్ల - కాలము — ఒక్క - రీతిగ.-- నడువదు **
ఒక్క - చోటనె — కాల - చక్రము - నిలువ - దు *** ||ఎల్ల||

కాల - మంత * — ఒకే - రీతిగ - నడచిన ***
ఒకే - చోటను — కాల - చక్రము - నిలచిన ***
జీవ - వాహిని — సా * - గదు **
సృష్టి - యిలలో — పుష్టి - నొందదు ||ఎల్ల||

శైశ - వం ** — బాల్య - ము *** — యవ్వ - నం **
క్రమము - వీడక — వీడ - వోలె * — అను - సరించు *
అంత - లోనె * — వా * - ర్ధ — క్యపు - ఛా * యలు ** — ఆ - వరించు ||ఎల్ల||

పవలు - రేయి * — వెలుగు - చీకటి — పరుగు - లిడగ *
చల్ల - నైన * — శశిర - ము *** — తాప - మొలికే — గ్రీష్మ - ము ***
సుఖము - దుఃఖము — తీపి - చేరు *
ఒకటి - వెంబడి — ఒకటి - వచ్చు *
వివిధ - రీతుల — అనుభ - వమ్ముల
కలుగ - జేయుచు — కదలి - పోవు * ||ఎల్ల||

ముందు మాట : తమ్ముడూ కష్టాలు నష్టాలు అన్నీ యీ ప్రపంచంలో నీ ఒక్కడికే మాత్రమే సొంతమైనట్లు భీతిల్లకు దిగులొందకు అసలు

# దిగులు లేనివాడెవ్వడు

**తకిట - తకిట - తిస్రగతి**

దిగులులేని - వాడెవ్వడు - యీ జగతి *
బ్రతికియున్న - ప్రతిమనిషికి - యేదో వెలితి ॥దిగులు॥

ఉన్నవానికున్నది ** - ఉన్నందుకు - దిగులు ***
లేనివాని - కేమో ** - లేనందుకు - దిగులు ***
సంతానం - లేకుంటే - లేనందుకు - దిగులు ***
అది అధిక - మైనవాని - కేమో ** - సంతాపమె - మిగులు *** ॥దిగులు॥

నీడలేని- వాడేమో - మేడలు కో - రు ****
మేడలున్న - వాడేమో - తోడు కొరకు - పో * రు **
ఆత్మీయత - నొసగే ఒక - తోడు కొరకు - పో * రు **
తిండిలేని - వానికేమొ - ఆకలి పొగ - లు *****
తినుటకున్న - వానికేమొ - అరగని తెగు - లు *****
కురూపియగు - భార్యవుంటె - ఒకడేమో - కుములు ***
అందమైన - భార్య వుంటె - అనుమానపు - దిగులు*** ॥దిగులు॥

సోమరితనాన్ని మించిన జాడ్యం లేదు -
పరిశ్రమను మించిన మందు లేదు

# శ్రమను నమ్ముకొంటే

తిశ్రగతి - తకిట

శ్రమనునమ్ము - కొ * ంటే * - సుఖమునొందు - తా * - వూ *
శ్రమనునమ్ము - కొం * టే * - భ్రష్టుడవై - పోతావు *

॥శ్రమను॥

పనిపాటలు - లేకుండా - సోమరివై - పడియుండి
ఏ తిండిని - ఏకెవరో - అందిం * చు - తా * రని *
భ్రమించుచు - యీ సమాజ - వృక్షానికి
చీడపురుగు - వై **** - జీ * వించ - క . . . . . . . .
పూవు పూవు - పూవునకే - గీ **** - పూతేనెలు
సేకరిస్తు - పుప్పొడిని * - ఒడిలోనిడి - ఫలదీకర
ణంబు గూర్చి - తాను లబ్ధి - నొందుచు * - పరుల కొరకు-మధుపమువై
పాడుపడుచు - విరమించక - శ్రమియించే - భ్రమరమ్మై జీవించు...

॥శ్రమను॥

పుట్టిన ప్రతి - వాడు యిలలో - చేయాలీ - యేదో ఒక
కార్యం ** - చేసే ప్రతి - కార్యం ** - కావా * లి
ప్రయోజనం - తనకు *** - ఒరులకు కూడ *****
యిదే యిదే - ఘనతర పర - మా * ర్థం . . . . . . ॥శ్రమను॥

# మితిమీరి ప్రేమించకు

(Speed Song)

చతురస్రగతి - తకధిమి

4, 2 వ కాలములు

మించకు - మించకు - మించకు - ✻✻✻✻
మితిమీరి - దేవిని - ప్రేమిం - చకు ✻✻ ॥మించకు॥

అతిగా - మమతలు - పెంచు - కొనీ ✻
మితిమీరి - ప్రేమించి - మతిపిడి - చలియించకు ✻ - -
. . . . . . . . . . . . . . . . . . . . ॥మించకు॥

యీ ✻ - జీవన - యా ✻✻ - త్రలో ✻
యే బంధ - మెన్నా - ళ్ళో ✻✻ - . . . . .
యే - బ్రతుకు - యెటే - రో ✻✻ - . . . . .
యెవరికి - యెవ్వరి - తొ ✻ డె - న్నాళ్ళో ✻ ?
యెరుగగ - లేనీ - ప్ర ✻ శ్న - రాయది . . . . . . .
ఆ తోడు - పోయిన - పగిలిన - గుండెల
రగిలిన - మంటల - వేదన - లో ✻✻
మనలే - వు ✻ మరి - మరణించ - లేవు ॥మించకు॥

**ముందు మాట:** సాయం సంధ్యవేళ శరీరం ఎఱ్ఱగా కందిపోయి క్షణం విశ్రాంతి కొరకు పడమటి దిక్కున వస్తమించుచున్నాడు భానుడు

# అవని కృంగెడి సూర్యుడ

**భూపాలరాగము**

**మిశ్రచాపు - తకిట - తకధిమి**

రుధిర - ధారలు — ఒడలనిండ ※ — అరుణ రాగము—చిందుచుండ ※
అవని కృంగెడి — సూ ※ ర్యుడ ※※ — అందుకోమా — వందనములు

॥రుధిర॥

అగ్ని జ్వాలల — మండిపోతు ※ — గుండెనెత్తురు — ధారపోస్తూ
తిమిర రక్కసి — తరిమివేయగ — దినము దినము ※ —※※※※※※
ఉదయమాదిగ — రేయివరకు ※ — నిర్విరామపు— పోరుసల్పే
మహితవీరుడ — అందుకోమా — వందనములు ※ - ※※※※※※

॥రుధిర॥

నీవు లేనిదె — వెలుగు లేదు — నీవు లేనిదె — శక్తి లేదు ※
నీవు లేనిదె — భుక్తి లేదు ※ — అసలు యిలలో — సృష్టియేలేదు.
※※※.........................
శక్తిదా ※ త — సృష్టికర్తా — అందుకోమా — వందనములు ※

॥రుధిర॥

ముందుమాట: తమ్ముడూ! అనునిత్యం టి.వి.లను సినిమాల గందరగోళాలనే కాదు అప్పుడప్పుడు ఆ గగనతలాన్ని చంద్రున్ని నక్షత్రాల్ని గోళాల్ని పరికించు విజ్ఞత విశాలత, సౌందర్యం ఆనందం అందు కన్పిస్తాయి.

# చంద్రకాంతి

రాగం : హంసధ్వని,
తిశ్రగతి : తకిట

ఆ ప్రశాంత - చంద్ర కాంతి
అటులె పిలచి - యున్నది **
నిన్ను - చూచి - నన్ను చూచి
పకపకనగు - చున్నది ** ॥ఆ ప్రశాంత॥

యెన్ని నెలలు - దొర్లినా *
యెన్ని యేండ్లు - నడచినా *
ఆకశాన - చందమామ
అటులె వెలుగు - చున్నది ** ॥ఆ ప్రశాంత॥

యువకులంత - వృద్ధులైన **
తరములెన్ని - మారినా **
యుగములెన్ని - గడచిన **
యుజములెన్ని - మారిన ** .......
ఏడలేదు - వాడలేదు
ర * వ్వంత - యైనను **
తరుగలేదు - కరుగలేదు
కొంచెమైన - ను ***** ॥ఆ ప్రశాంత॥

చల్లనైన - వెన్నెల - కురిపించుచు ***
అమృతకిరణ - స్పర్శతో *
అవని జనుల - నెల్లరను *
ఒక్కరీతి - నలరించుచు ॥ఆ ప్రశాంత॥

ముందుమాట: ఆహా యీ అనంత విశ్వాంతరాళమునకు రూపకల్పనచేసిన ఆ విశ్వశిల్పి యెవ్వడో కదా !

# విశ్వశిల్పి యెవ్వడో

అద్భుత రసం - తిశ్రగతి : తకిట తకిట

3 వ కాలం లేక 2 వ కాలం

యీయనంత - విశ్వమునకు - రూపకల్ప - న జేసిన
ఆ ***** - విశ్వశిల్పి - యెవ్వడో * - ****** ? ॥యీయనంత॥

వి - శిష్ట ప్రజ్ఞ - పాటవముల - పృథ్వినిలను - జేసి ***
వివిధ వర్ణ - శోభితమయ - జీవులనే - ర్సరచి **
విరమించక - పయనించే - రవిచంద్రుల - నాడగూర్చి *
పవలు రేయి - వెలుగునీడ - పరిభ్రమణ - గావించి *-॥యీయనంత॥

ఆది యేదొ ? - అంతమేదొ ? - అంతుచిక్క - నీ * యక *
కోట్ల కోట్ల - పెనుతారల - వినువీధిని - కనువిందుగ
మిలమిలమిల - మిరుమిట్లను - గొలుపునటుల - వెలిగించి *
విశ్వమంత - తానెయై * - తా * వే * - విశ్వమై *
తామలేవి - తావులేక - తనయునికివి - తెలియనీక
అత్యద్భుత - లీలలతో - క్రీడలాడు - విశ్వశిల్పికి . . . . .
శతసహస్ర - వందనాలు - అర్పిం * చు - దామంటే
కానరాడు - యెక్కడ దా - గున్నాడో - ****** ?
ఆ శిల్పి - మహా చిలిపి - యెక్కడ - దాగున్నాడో ? ॥యీయనంత॥

# యెన్నడు యెరుగని రసానుభూతిని

(ప్రణయగీతిక)

2 వ కాలం 4 వ కాలం

చతురస్రగతి - తకధిమి

పాకే : (ఓ చెలీ .................)

యెన్నడు - యెరుగని - రసాను భూతిని
కలిగిం - చవే *..... యీ **- రేయి * ॥యెన్నడు॥

అమవస - చీకటుల - ముడివేసి - నటులుండు
నీ పిలి - కురులు *...........
పున్నమ - చంద్రుని - బంధించి - నటులుండు
నీ ** - ముఖమండలము * - .......... ॥యెన్నడు॥

మదనుని - పదునగు - శరముల - వర్షం
కురిపించు - నీ కమల - నయనా - లు ****
రాయంచ - మరపించు - నీ హోయల - నడకలు
వనువిలువ - నీ యవు - క్షణమై - నను ** ॥యెన్నడు॥

వే * యి - వీణలు - మీటిన - యటులుండు
నీ ** - మృదుభాషణలు ..........
కో * టి - స్వర్గాల - సౌఖ్యాల తేలించి
యలరించు - నీబాహు - బంధాలు ....... ॥యెన్నడు॥

# ప్రియభామినీ

రాగ - రాగ - రాగి - ణీ **
రాగ - సుధా - వాహి - నీ **

రావే ప్రియ - భామినీ
నామానస - హారిణీ

నవవికసిత - చలితలలిత
కమలమునీ - కనుద్వయము
వడివడిగ * - యెదనుదోచు
వాడివేడి - మరుని శరము
నీ * - చూపు

నీ **** - పగడా * ల
అధరా * ల వెలువడె *
ప్రతి పలుకు * - మధురమైన
తేనెలొలుకు - చినుకు ***
మం * జీర - రవళులతో
రమ్యమొప్ప - మేళవించి
నడయాడే - నీ * * వయ్యారపుటడుగులు
నవమయూరి - నాట్యతతులు

# నా పాల మనసులో

శృంగార గీతిక)　　　తిశ్రగతి - తకిట

సా.కీ ॥ (నా . . . . పాల మనసులో . . . . .

వలపు పంచదార కలిపితిరా ! . . . . .)

అందుకో ※ - చెలికాడ ※ - మధురమైన

యీ కలశం . . . . . . .

- ※ అసలు ※※ - మధువుకన్న - యిదే యిదే

అమితమైన - మత్తురా ※ . . . . . . .　　॥అందుకో॥

ఒకసారి ※ - అందుకొంటె - యింక మరువ - లేవురా ※

నీ ※※※※ - వింక మరువ - లేవురా ※ - . . . . . . . .

అందాల ※ - నా కళ్ళలో - బందీవై ※ - పోతావుర

బందీవై - పోతావుర　　॥అందుకో॥

అమృతము ※ - కురిపించు ※ - పగడాల ※ - అధరాలు ※

నా ※※※※ - పగడాల ※ - అధరాలు ※ - . . . .

తనువునే ※ - మరపించు ※ - నీ ※※※※ - తనువునే ※

మరపించు ※ - బిగి ※ - కౌగిలింతలు ※※※※ -　　॥అందుకో॥

# అంకితమైపోయాను నీకే

తిశ్రగతి : తకిట - తకిట

ఎందుకో * - ****** - అంకితమై - పో * యాను
నీ * కే * - ****** - . . ఓ **** - రాగమయి * ॥ఎందుకో॥

శిలవం * టి - నన్ను *** - కరగించి - నావు ***
కదలిం * చి - నా * వు ** - . . . . . . . . ॥ఎందుకో॥

మమతా * ను - రాగా * లు - చిలికిం* చి- నావు***
యెదలో * న - రాగా * లు - పలికిం * చి- నా * వు**
విడలే * వి - బంధా * ల - బంధిం * చి - నావు ** ॥ఎందుకో॥

క్షణమై * న - వినుపీ * డి - మనలే * ను - నే * ను **
మవు లే * వి - బ్రతుకిం * క - ఊహిం * చ - లే * ను **
యీాయా * కు - భువిపై * కి - రాలేదా - కా ****
ప్రాణా * లు - యీా * తనువు - వీడేదా - కా ****
నీతో * డు - నాకుం * డు - వరమీా * య - మనుచు ***
వేడే * మ - ఆయే * డు - కొం* డల * - వెంకన్నను ॥ఎందుకో॥

**ముందుమాట :** ఒక భగ్న ప్రేమికుని విషాద గీతిక

# కూలిపోయెనా ఆశాసౌధం

2 వ కాలం చతుస్రగతి

కూ ※ లి - పో ※ యె - నా ※※ - ఆశా - సౌధం
కా※ లి- పో ※ యె - నా ※※ - మమతల - నిలయం

నీవే - నీవే - నా ※※ - లో※ క-మనీ ※
నీ※వు - లేనిదె - శూన్యమ - నీ ※※ - తెలిపిన - నీ ※ వు
యెన్నో - బాసలు - చేసిన - నీ ※ వు
వెడలి ※ - పోతివి - యేలో - కాలకౌ ※※※ - . . .

చేసిన - బాసలు - బూడిద - కలువగ
నా ※※ - గుండెలు - బండగ - మిగిలిపోయెను ※
జీవన - వాహిని - యెం ※ డి - పోవగ
బ్రతుకే - మోడుగ - వా ※ డి - పోయెను

మనిషికి - మనసును - ముడివే - సీ ※※
మనసుకు - వలపుల - వలవే - సీ ※※
ఆ ※※ - వలలో - మమతల - హృదితగులుకొనగ
నీటిని - విడచిన - చేపవ - లె ※※※ - గిలగిల - లాడెను - మనిషి

**ముందుమాట :** ఒక ప్రేమోపహతుని వేదనా గీతం

# మానిపోవు గాయముల మరల రేపకు

**రాగం : హిందూస్థానీ తోడీ**

**తిశ్రగతి : తకిట - తకిట - 2 వ కాలం**

మరచిపోవు - తలపులను - తిరిగితోడ - కు *****
మానిపోవు - గాయముల * - మరలరేప - కు ***** ॥మరచి॥

మానిపోవు - గాయముల * - మరల మరల - రే ** పి *
తీయనైన - విషాదమును - గుండెలరగి - లించకు ** ॥మరచి॥

గడచిన జీ - వితమంతా - మధురస్వప్నము . . . .
యీ **** - మిగిలిన జీ - వితమింకా - మోయలేని
యీద్చ - లేని . బ్రతుకు భార - ము . . . . . . . .
బ్రతుకు భారము . . . . . . . . ॥మంచి॥

యెవరి తోడు - యెంతవరకో
యేబంధం - యెన్నాళ్ళో
యీ జీవన - యాత్రలో
యెవ్వరికి - యెరుకపడుమ ॥మరచి॥

# జీవిత స్వప్నం

**తిశ్రగతి : తకిట - తకిట**

జీవితం * - ****** - స్వప్నమై * - ******
కరలిపోయిందీ *** - కరగిపోయిందీ *** ॥జీవితం॥

శైశవం * - బాల్యము ** - కౌమారం - యౌవ్వనం *
రెప్పపాటు - క్షణములో - వచ్చి యెగిరి - పోయిందీ ॥జీవితం॥

యీ **** - రెప్పపాటు - క్షణములో - - - -
యెన్ని ఆటు - పోటులో * - యెన్ని తీపి - చేదులో *
రాగప్రేమ - ద్వే * షాల - అలజడులు * - ******
కామక్రోధ - మత్సరాల - ఉప్పెనలు ॥జీవితం॥

మనిషి మనిషి - గుండెలలో - తుపానులు * - . . . . . . .
తీయనైన - తలపులు ** - గుండె పగులు - క్షోభలు *
చెలరే * గి - చెలరే * గి - తురకుయివి * - . . . .
చల్లారే - దెప్పుడు ** ? - మరపు అనే - వరములో
స్వప్న భ్రాంతి - చాయలో * - కొంత చల్లారిన ***
పూర్తిగా చ - ల్లారునది - యెన్నడు ** - లేవలేవి
శాశ్వత వి శ్రాంతిలోనె - . . . . . . . . . . . . . . .
. . . . . . . . . . . . . . . . . . . . . . . . . . ॥జీవిత॥

ముందుమాట : ఎంతటి నిష్ఠాగరిష్ఠుడైనా యీ మమతానుబంధాల వలలో చిక్కి ఒక్కమారైనా కన్నీరు పెట్టక మానడు. సుఖ దుఃఖాల పరిభ్రమణా వలయమే మానవ జీవితం !

# మమతల కలతల నిలయం

చతురస్రగతి - తకధిమి

మమతల - కలతల - నిలయం - ****
జీవిత - మొక వల - యం ** - **** ॥మమతల॥

లయమెం - దేవర - కు *** - ****
సుఖ దుః - ఖముల * - * వెలుగు - నీడల
వలలో - తగిలి * - గిలగిల - లాడే *
సతమత - మందెను - ప్రతిమని - షి *** ॥మమతల॥

యో * గికైనా - భోగి - కైనా
జ్ఞా * ని - కైనా - విజ్ఞాని - కైనా !
తప్పదు - తప్పదు - మానస - క్లేశము
పీ * శ - పైనా - * లేశ - మైనా !! ॥మమతల॥

పుట్టిన - ప్రతిమని - షికి ** - ****
ఏదో - క్షణమున - ఎవరో - మనిషిపై
కలుగక - మానదు - * మమత - * అనురాగం . . . . . .
ఆ ** - మమతను - నింపి * - ప్రేమను
పంచిన - మనిషి * - చివరకు - శాశ్వత
నిదురలో - ఎన్నడు - కనరాని - దూర
తీరాల - కేగిన - క్రమ్ముక - పో * దు
విషాద - చాయ * - * కారు మేఘమై . . . . . . . . ॥మమతల॥

# అంతులేని గారడి

**తిశ్రగతి : తకిట**

**రాగము : మధ్యమావతి**

కనులు మూసి - తెరచులోన - కదలిపోయె - రెందరో
నిరంతరం - జ్వలియించె - అంతిమ యా - త్రాస్థలికి

॥కనులు మూసి॥

నిన్న ఉన్న - వారు నేడు - కనుల ముందు - కనరారు ✻
నేడు ఉన్న - వారు రేపు - యెందరు నిలి - చుంటారో
తరచి చూడ - జీవితమొక - అంతులేని - గారడిరా !
యీ నిజమును - తెలుసుకొన్న - కలుగు నీకు - ఊరడిరా !!

॥కనులు మూసి॥

అను నిత్యం - ప్రవహించే - యీ జీవన - వాహినికి
ఆది యేదో - అంతమేదో - ఆవంతయు - కనరారు ✻
విరమించక - పయనించే - కాలచక్ర - భ్రమణంలో
తరములెన్నో - కరగిపోయె - మంచుతెరలు - గా ✻✻✻✻
కరగిన - ఆ తెరల - జాడ యించుకైన - మిగుల - కుండెగా

॥కనుల మూసి॥

**ముందుమాట :** ఆత్మీయతాను రాగాలనందించి యెందుకో యేవిధి వైపరీత్యముతోనో, కన్పించకుండ అదృశ్యమైన తన ప్రియురాలి కొరకు ఒక ప్రేయుని వేదన

# ప్రేమలు అవి యెదలకు గాయాలు

**తిశ్రగతి - తకిట - 2,3 కాలముల మిశ్రమము**

ప్రేమలు ** - అవి యెదలకు - గాయాలు * - ******
ఆత్మీయత - లు ***** - అంతులేని - అగాధాలు ||ప్రేమలు||

ఓ చెలీ * - ఏ * విధి * - ప్రేరణతో - ఒకరినొకరు - కలిసేమో
మధురిమలోన - గి ***** - మమతలు విం - పి *****
వెడలిపో * - యావు చేర - లేని దూర - తీరాలకు
దూ *** ర - తీ * రా * - లకు . . . . . . . . . ||ప్రేమలు||

సంగమం * - మధురా * ను - భవమైతే - ******
వియో * గం - విరతము దహి - యించు అగ్ని - గుండం **
మన జీ * వి - తం ఒక ** - తీయనైన - వ్యధాభరిత
కా * వ్యం * . . . . . . . . . . . . . ||ప్రేమలు||

కనుపాపను - వే * వై * - కంటివెలుగు - వీ * వై *
బ్రతుకున శృతి - వే * వై * - భవ్యదివ్య - జీవన నవ
రాగము నీ - వై **** - దే * హములు - వేరైన *
ఉచ్ఛ్వాశమె - వేను కాగ - విశ్వాసము - నీ*వై*
ప్రాణమొక్క - టే * యగుచు - మెలగిన మన - ము *****
చివరకు మిగి - లేములే * - మధురస్మృతులుగ ****
చలనరహిత - శిలలుగ ** - నిర్జీవ * - ప్రతిమలుగ *

ఒక భగ్న ప్రేమికుని విషాద గీతిక

# గమ్యములేని జీవిత నావ

**తిస్రగతి : తకిట - తకిట, 2 వ కాలం**

గమ్యములే - నీ ** యీ - జీవితనా-వ *****
యెటు పోతుం - దో **** - పోనీలే - పోనీలే
పో ** నీ - లే ** . . . . . . . . . . . ॥గమ్యము॥

పోయి పోయి - పో * యీ * - యే సుడి గుం - డం * లో *
చిక్కుకు పో - తుం * - దో * - పోనీ . . . . . . . . . .
యే * పెను * - బం * డకు - తగులుకొని * - ముక్కచెక్క
లవుతుందో - అవ్వనీ * - అవ్వనీ * . . . . . . . . . ॥గమ్యము॥

మమతలచు - క్కానీ ** - య్యేవాడో - విరిగే **
కోరికల * - తెరచాప * - మున్ముందే - చిరిగే **
యే **** - మనసు మమత - లేనీయే - చీకు చింత
లే * నీ * - జీవిత నా - వ ***** - నట్టనడి *
సంద్రంలో - కొట్టుకొని * - పోతోందీ - ** . . . . . ॥గమ్యము॥

యెవరిపై - నా మమతలు - పెంచుకున్న
చివరకు మిగి - లేవి నీకు - కలతలన్నా -
యెవరి చుట్టూ ఆశలు - అల్లుకొన్న
బిగుసుకుపో - తాయి మెడకు - ఉరిత్రాళ్ళుగ ॥గమ్య॥

# రాలిపోవు రేకు కొరకు

**తిశ్రగతి - తకిట 2 వ కాలం**

రాలిపోవు - రేకు కొరకు - తపన యెందు - కు *****
కూలిపోవు - ఆకు కొరకు - కుములుటెందు - కు ***** ||రాలి||

పూచినట్టి - పూవులన్ని - నేలరాల - కుండునా ?
కాచినట్టి - కాయలేమొ - ధరణికొరగ - కుండునా ? *
పుట్టిన ప్రతి - వా * డు ** - నే * డో * - రే * పో *
ముందు వెనుకొ - గిట్టకుండు - నా ? . . . . . . . . . ||రాలి||

క్షణము క్షణము - కడలిలోని - జలముయిగిరి - నింగికెగిరి
పోవును ** - నింగికెగిరి - మరల కరిగి - వర్షధార
కురిసి కురిసి - చివరకు యా - కడలి చేరు - ను *****
పదార్థమే - శక్తిగా * - శక్తియే * - పదార్థముగ
పరిభ్రమణ - చెందుచు * - మనోభ్రమను - కలిగించుచు
పుట్టిగిట్టి - వశియుంచుచు - సృజియిం * చుకొనుచు ***
సృష్టిమూల - వస్తువు ** - తరుగక ** - పెరుగక **
శాశ్వత - మ్మగుచు విలువ - జననమరణ - ఘటనలకై
వ్యాకులమును - చెందవేల ? - విలపిం * ప - వే ** ల * ?||రాలిపోవు||

# బొమ్మలాట

**తిశ్రగతి - తకిట**

యిది యే * మి - బొ *** మ్మ - లా * టా * . . . . . . .
ఆటా . . . . . . . . టాటా . . . . . . . . ॥యిది యేమి॥

యీా * ఆట - అ * డించి
మురిసే * ది - యె *** వ్వ - డంటా ** ? . . . . . ॥యిది యేమి॥

రాజా *** - బంటు *** - . . . . . . .
నాయకుడు * - సేవకుడు * - . . . .
రకరకాల - పాత్రల
రమ్యమొప్పగ * చేసి . . . .
నవరసాల - సంఘటనల
వేర్పుగసమ - కూ * ర్చి * . . . . . . . .
ఆడిం * చి - క్రీడిం * చు
వాడెవ్వడంటా ?. . . . . . . . ॥యిది యేమి॥

ఒక చో * ట-పెం *** డ్లి - సం *** బ - రాలు ***
యిం **** - కొక చో * ట - మరణ విలా - పా * లు **
ఒక చోటను - చిరునవ్వుల - ప ***** - న్నీరు ***
యిం **** - కొక చోటను - పెడబొబ్బల - క ** న్నీరు ॥యిది యేమి॥

# పేదలం నిరుపేదలం

**తకిట - తకధిమి - మిశ్రచాపు - గతి**

పేద - లం నిరు — పేదలం **
బండ - బారిన — బ్రతు - కులం *
మోడు - వారిన — జీవు - లం **

॥పేదలం॥

రక్త - మంతా — చెమట - చే * సి
చెమట - నంతా — శ్రమగ - మార్చి
తిండి - గింజలు — దే * శానికి - పంచు - వారం
పూటతింటే — పూట - పస్తులు — ఉండు - వారం

॥పేదలం॥

ఆ * - కా * శ — మం * - టే ** -
భవనాలనె — వ్వో ***** — నిర్మించి కూ—డ ******
తలదాచుకొన - గ ****** — గూడు - లేని * — పక్షు - లం **

॥పేదలం॥

పట్టు - బట్టలు — వేయు- వారం
పెట్ట - గోచీ — లేని - వారం
జ్వరము - జాడ్యము — దరికి - చేరిన
మందు - మాకులు — వేయ - లేక *
దై * - వముపై — బరువు - మో * పి
వీవె * దిక్కని — మొక్కు * వారం

॥పేదలం॥

# ఓ బాటసారీ

చతురస్రగతి - తకధిమి 2 వ కాలం

వ్యధిత * - హృదితో ........
పయనించు - ఓ బాట - సా ** - రీ **

॥వ్యధిత॥

చీకటి - తెరలను - చీ * ల్చి - చెండుచు
భానో - దయము * - కా * క పో * వు - నా ?**
బ్రతుకున - క్రమ్మిన - నైరాశ్య - తిమిరం
అం * త - రించగ - ఆశా - జ్యోతి * -
ఉదయించ - కుం * - దు నా ? ** -

॥వ్యధిత॥

మం * దు - వేసవి - సూర్యా - తపమున
వాడిన - తరులు * - చిగురులు - తొడిగి *
కుసుమించ - కుం * దు - నా ........
తొలకరి - ఝల్లుల - తాకిడి - తో ......

॥వ్యధిత॥

సుఖమును - వెంబడి - దుఃఖము ......
దుఃఖము - వెంబడి - సుఖము ......
అరుదెం - చకమా - నవు పరిభ్రమించుచు
కా * ల - చక్ర*క - గమనం - లో **

॥వ్యధిత॥

# సోదర నిద్ర నుండి మేలుకో

(ప్రబోధ గేయం) తిశ్రగతి : తకిట - తకిట

ఉషోదయం - అగుచున్నది - నీకోసం - ******
సోదరా * - నిదురనుండి మేలుకో - ******

॥ఉషోదయం॥

అవనిపైన - అలముకొన్న - పెనుచీకటు - లన్నిటిని *
పటాపంచె - లే * జేసి - చీకటిబ్రతు - కులలోన *
వెల్గులనే - చిమ్మగ - అరుదెంచుచు - నుండెనదె -
తూరుపు కొం-డల * - నుండి బాలభాను-డు.......

॥ఉషోదయం॥

తరిమిన చీ - కటులు మరల - ప్రతిరేయి * - అవని నావ
రించుచుండ - పరాజయము - నొందితినని - యెంచక **
విసుగొందక - విరమించక - సృష్ట్యాదిగ - కోట్ల - వత్స
రముల నుండి - దినము దినము - నూత్నతేజ - స్ఫూర్తితో
కర్తవ్య * - పాలనసా - గించె భాను - డు *****

॥ఉషోదయం॥

గతరాతిరి - పీడకలలు - నిరాశా * - నిట్టూర్పుల
చేదువగరు - అనుభవాలు - సకలమును * - విస్మరించి
నూత్నతేజ - స్ఫూర్తితో - దృఢతరసం - కల్పచిత్త
శుద్ధితో * - కర్తవ్యోన్ముఖుడవై - మున్ముందుకు - సాగిపో

॥ఉషోదయం॥

# నవవసంత ఆగమం

(ప్రకృతి వర్ణన) తిశ్రగతి : తకిట - తకిట
రాగము హిందోలా 3 వ కాలం

నవవసంత - ఆగమం * - ప్రకృతి సమ - రమణీ * యు
హసిత హరిత - వస్త్రధార - ణం వినూత్న - వస్త్రధారణం

॥నవ॥

అసంఖ్యాక - వికసితనవ - కుసుమహారుల - లావణ్యం
సుమ పరిమళ - మలయపవన - ప్రపుల్లితం - ******

॥నవ॥

కొమ్మ కొమ్మ - కోయిలమ్మ - కుహుకు హు - మంజులగానం
కిలకిలకిల - కీరతతుల - కేరింతల - ఆరావం

॥నవ॥

గలగలగల - సెలయేరుల - విస్వనం - ******
పురివిప్పిన - వనమయూర - సంతతుల * - ఝునఝునఝున
ఝునంజనన - సం * తోష - నృత్యవిలా - సం ****
యెటు చూచిన - యీ **** - సృష్టియంత
శ్రవణ నయన - మనోహరం . . . . . . . . . .
ఆహ్లాదం - సంబరసం భరితం ** - ****. . . .

॥నవ॥

# అతియన్నది వర్జితం

తక - తక - తకధిమి;   చతురస్రగతి 2 లేక 3 వ కాలం

ప్రాణం - విలువా - లం** -టే **.........
గాలీ - నీరూ - కావా - లీ ప్రతి - మనిషికి ........ ||ప్రాణం||

ఆగాలే * - ********* - సుడిగాలై ** - తిరిగితే
పెనుతుఫానుగా - మా ** రితే * - అంతా విలయం
ఆ నీరే ** - వాగులు వరదలు - గా ** - పా * రి - తే **
ఉప్పెనయై ** - పొం * గి - తే ** - అంతా ప్రళయం ||ప్రాణం||

మోతాదుగమం - దునుసేవిస్తే *
పెంచును - ఆరో - గ్యం **
దావివి - మిం * చి -- మ్రింగితె కొని తెచ్చును రోగం
ధనము * - సంపద - పెరిగిన - ..........
బలము * - మదము * - హె*చ్చి - న ***
ఆ*వ - హిం*చు - అహంకా*ర - అం*ధ - కారం
క*న్నులుండగ - వే ............ ||ప్రాణం||

అతినిద్ర ** - అతి వి - నయం **
అతియన్నది యెన్నడు వర్జితం
మితభో * జనం - మితభాషణం
మితమే సర్వద - అభిలషనీయం ||ప్రాణం||

# కన్నులుండి కనుగొంటే

**తిశ్రగతి తకిట - తకిట**

**రాగం : భీమ్ ప్లాస్, కాలం : 2 వ కాలం లేక 3 వ కాలం**

కన్నులుండి - కనుగొంటే - యీ **** - భువి వెలసిన
ప్రతి వస్తువు - ప్రతి జీవి * - అందించెను - యేదో యొక
సం ** దే - శం **** - . . . . . . . ॥కన్ను॥

పూతేనెలు - గ్రో * లుచు * - పుప్పొడి వెద - జల్లే **
మధుకరమం - టున్నది ** - తానొవ్వక - యితరుల **
నొప్పించక - యిచ్చి పుచ్చు - కొనమని ** - ****** ॥కన్నులు॥

తరుశాఖలు - వ్యాపించి * - పైనుఊడలు - నిలద్రొక్కి
వందలవే - లాది పక్షి - సంతతులకు - గృహములిచ్చి
వటవృ *క్ష - మంటున్నది - పదుగురకుప - యుక్తమైన
వా * దే * - కలిమిబలిమి - సార్ధకమని . . . . . . . . . ॥కన్నులు॥

తిన్నదొక్క - ముద్దయైన - విశ్వాసమె - తనకు ***
ఉ * చ్ఛ్వాశ - నిశ్వాసము - లై వెలసి * - ******
యజమా * ని - కొరకై ** - ప్రాణత్యాగ - మే చేసే
శునకము అం - టున్నది ** - . . . . . . . . .
పాలు త్రాగి - రొమ్ము గుద్దు
నరునిని - గ్గిల్లమని * . . . . . . . . . ॥కన్నులుండి॥

**ముందుమాట:** ప్రభో నీ అనంత సృష్టిని వీక్షించి ధర్మాధర్మ విచక్షణను పాప పుణ్య విచక్షణను యిదమిద్ధముగా తెలియలేకున్నాను. నాకు తెలిసిన మేరకు సత్యాన్నాచరణగావించి ఫలితాన్ని నీ దివ్య పదముల చెంతనుంచి ప్రణమిల్లుచున్నాను. త్వమేశ శరణం ! శరణం !!

# ధర్మమన్నదదెక్కడోయీ

**తకిట - తకధిమి, మిశ్రచాపు : గతి**

ఎక్క- డోయీ - ఎక్కడోయీ - ధర్మమన్నద - దెక్కడోయి . .

ఎక్కడో ** - యీ . . . . . . . . . . . . . . . . . . . ॥ఎక్కడోయీ॥

కీట - కమ్ముల - నోట - కరచెడి - బల్లి - కనుగొను - మా * -ఆ **

బల్లి - కనుగొను - మా . . . . . . . . . . . . . . . .

ఆ * - **** - బల్లినే బలి - గొనగచూసెడి - యీ * - ****

పిల్లి - కనుగొను - మా * - యీ ** - పిల్లి - కనుగొను - మా * - ****

॥ఎక్కడోయీ॥

నీట - నుండిన — చిన్న - చేపల — నోట - కరచెను — పెద్ద - చేపలు

నేల - నుండిన — భూరివృక్షపు — నీడ-నుండిన — పిల్ల - మొక్కల

పెరగ - నీయద — దేమి - ధర్మమో ***** . . . . . . . . . . . .

ప్రక్క-తికి దే-మి కర్మమో . . . . . . . . . . . . . . . . ॥ఎక్కడో॥

# ఒరే ఒరే మనిషి

'భీమ్‌ప్లాస్ లేక మోహనరాగం - తిశ్రగతి (తకిట)

ఒరే - ఒరే - మనిషి ***- ఒరే ఒరే - మనిషి ***
మంచేదో - చెడ్డేదో -- తెలియర విడ మరచి *** ॥ఒరే ఒరే॥

ఒకే గడ్డపై పుట్టి -- ఒకే గాలి - గ్రో*లీ*
ఒకే నీరు - త్రా ** గి* -- పెరిగిన మన మందరము*
భరతమాత - బిడ్డలము . . . . . . . . . . . . . ॥ఒరే ఒరే॥

ఒకే తల్లి - పాలతో -- మనము యెదిగి - నా ****
ఒకే రక్త - మందరిలో -- ప్రవహిస్తున్నా ****
ఒక సంస్కృతి - అందరిలో -- నెలకొనియున్నా ****
ఎక్కువ త-క్కువలంటూ -- కులముల సృజియించాము ॥ఒరే ఒరే॥

విజ్ఞానపు వెలుగులు మీ -- కంటికి పడ వు *****
చదువు సంధ్య - లందరు ** - గరువగరాదు *****
చదువవిన్న - వారి - చెవుల -- సీసము పోయించాము
పుస్తకములు - చేతబట్టి -- చేతులు ఖండించాము ॥ఒరే ఒరే॥

# బాపూ లేచిరా

**చతురస్ర గతి - తకధిమి - 2 వ కాలం - 4 వ కాలం సమ్మేళనం**

బాపూ - **** - లే*చి - రా ** -
కలతలు - మాపీ - మమతలు - పెంచీ
మనిషిని - మనిషిగ - తీ * ర్చి - దిద్దగ ॥బాపూ॥

దినము * - దినము * - పెరిగెను - హింస *
క్షణము * - క్షణము * - తరిగెను - శాంతి *
కులముల - మతముల - చి * చ్చు - రగిలి *
కుత కుత - లాడెను - దే * శ - మంతా ॥బాపూ॥

వే * ను - వేనను - మాటే - గాని *
తో * టి - నరుని * - సుఖము * -దుఃఖము
సరకు చేయక * - మనసు * - మమత
నీతి * - న్యాయం - మట్టు - పెట్టి *
కరుడు గట్టిన * - స్వార్థముతో **
సం * చ - రించెను - ప్రతిమని - షి *** ॥బాపూ॥

- * మృగముకన్న * - మి * న్న - గా ** - మం*చి - చెడ్డల
జ్ఞా*న - మరయగ - మేటిగ - మెదడును
సమకూర్చి యుండగ - ఆ ** - మెదడును
త్రుటిలో - హతమొన - రించే - త్రాగుడు
వ్యసనపు - బానిస - లై ** - శ్రుతివిడిన
మతిచెడిన - బ్రతుకుల - సాగించు
నరులను - కాపాడ . . . . . . . . . . . . ॥బాపూ॥

# ఎచటికిపోతున్నది దేశం

3 వ కాలం - తిశ్రగతి - తకిట - తకిట

రాగం - హిందూస్తానీ తోడి

ఎచటికిపో - తున్నది ** - ఏ*మౌ* -తున్నది **
దేశం ** - మన భారత - దే*శం* - ****** ॥ఎచటికి॥

ఎటు చూసిన - ఆక్రందన - లే **** - .......
అన్నార్తుల - ఆక్రందన - లే ............
ఆవే*శ - కావేశా - లే **** -
ఉద్రిక్తత - లే **** ...... ॥ఎచటికి॥

యెదుటివాని - కొరకు *** - పుంతయినా - యోచించక
అంతా నాకేనంటూ - కబళించే - స్వార్థపరులు ఒకవంక
మనకర్మం - యిది యంటు * - కృంగికుమిలి - కృషించే
విరుపేదలు - యిం **** - కొక వంక * - .... ॥ఎచటికి॥

దినము దినము - జననవము - లక్షలాది - జనం ***
యెంత పంట - పండించిన -- యిన్ని నోళ్ళ - కందించగ
యెక్కడుంది - భోజనం * - జనవాలను - జనాభాను
అదుపు చేయ-కుం*టే* - పాదుపు చేయ - కుం*టే* ॥ఎచటికి॥

చేయుటకే * - పనిలే*దు - కోట్లా*ది జనులకు**

పనియున్న * - వారేమో - పనిచేయరు - సోమరులై

కులములతో - కుమ్ములాట - ఒక * చోట -

మతములతో - కీచులాట - యిం **** - కొకచోట *

భాషాపై - షమ్యాలతో - విద్వేషాలు - వేరొకచో-ట . . . .

అనుక్షణం - ఘర్షణలతొ - సతమతమం - దెను దేశం

శాంతి*సహ - జీవనం * - సౌభ్రాతృ - త్వం ****

అభిలషించు - వా*రలె* అందరు యై - వా ****

యెవడో ఒక - ఉన్మా*ది - రగలించే - చిచ్చుతో *

భగ్గున పె - ల్లుబికేను - వి * ద్వేషాగ్నిజ్వాల

సమ్మెలు ** - బందులు ** - అత్యాచారాలు **

దహనకాండ - లు ***** - . . . . . . . .

ఒక్కనాటి - సమ్మెతో * - వందలాది - కోట్లుగ **

జాతీయాదాయపు న-ష్టం **** - చివరికెవరి - కావష్టం

ప్రజలకు దే - శానికే * - . . . . . . . . . ॥ఎచటికి॥

## చంద్రకిరణాలు - ప్రథమభాగం సమాప్తం

## గోపాలకృష్ణయ్యా

చతురస్రగతి - తకధిమి; రాగం : తోడీ 2,4 కాలములు

జయ జయ - గోపాల - కృష్ణ - య్యా**
అందు * కోవయ్య ** - అభినం - దనలు * ॥జయ॥

మే*టి - సృష్టిని - చే*సి - నట్టి *
- * మహిత - మహి - మాన్వితా * - ****
నీపద - ములకివె - కుసుమ సు - మాంజలులు ॥జయ॥

కో * ట్ల - కోట్ల - జీవుల - చేసి *
దే*వి - రూపును - దానికి - కూర్చి *
విం * త - వింతల - శోభల - చేర్చి *
రమ్య మ - నోహర - ప్రకృతి - ని ***
గావించి - నట్టి * - పా*టి - లేవి*
శిల్పివి - నీవు - . . . . . . . . . .
- * కళల - కెల్లా - అద్భుత - మైన *
జీ * వ - కళను * - నేర్చిన - నీవు *
కడువే - ల్పరివ - య్యా ** -
. . . . . . . . . . . . . . . . . . . . ॥జయ॥

గిరులలో - తరులలో - సెలయే - రులలో
కదలిత - రగల * - ఉరుకుల - పరుగుల - లో . . . . . . . . . . .
నిరతము - ధ్వనించు - యెన్నో - రాగాలు
రాగా - లెన్నో - అనురా - గముతో
ఆ * ల - పించే - గాయక -రత్నము
అం * దుకొనుమా - అభినం - దనలు *
రూపము - లన్నీ - నీవై * - వెలసి *
రూపము - లేక * - నిలి- చావు ***
గుణములు - అన్నీ - నీవైయ్యొప్పి**
నిర్గుణ - తేజుడ - వయ్యావు *** ||జయ||



డాక్టరు కుడుపూడి సత్యనారాయణ రచించిన
**గోపాలకృష్ణయ్య గేయమాలికను** తూర్పుగోదావరి జిల్లా ప్రిన్సిపాల్
సెషన్స్ జడ్జి శ్రీ డి. రామలింగస్వామి ఆవిష్కరించినప్పటి చిత్రం.
ఆంధ్రభూమి డైలీ తె 15-9-1985 కోస్తావాణి డైలీ తె 13-9-1985
ఆంధ్రపత్రిక డైలీ తె 15-9-1985 ఈనాడుడైలీ తె 12-9-1985
పత్రికలు భక్తిరసాత్మక, సాహిత్య సంగీతభావరస తరంగ ప్రతిభకు డాక్టర్
కుడుపూడి గారికి పలు ప్రసంశలనందించాయి.

# ఏమిటీ పులకింత

చతురస్రగతి - తకధిమి

కల్యాణి రాగము

**సాకీ:** మురళీ గాన విలోలా కష్ణా . . . . . . . . . . . . . .

**పల్లవి:**

ఏమిటీ - పులకింత - యెన్నడెరు - గనివింత

వినుగనిన - యంం*త - నీ మురళి - విననంత ॥ఏమిటీ॥

పృధివి * - మైమరచె - ప్రకృతి - పులకించె

పరుగిడు - మేఘాలు - వెనుతిరిగి - వచ్చె

యెగిరేటి -పక్షులు - యానమును - మరచె *

ప్రచండ - భానుడు - వెన్నెలలు - కురిపించె ॥ఏమిటీ॥

పూ తేవి - యలుగ్రోలు - భ్రరము - . . . . . . . . .

మే * త - మేసెదు - ఆ * ల - మందలు

వీనులు - రిక్కించి - ఆ * ల - కిం * చె

చెట్లు * - చేమలు - సకల చరాచర

ప్ర ** - కృతి ** - సర్వేశ - నీ మధుర

మురళీ - స్వరమును - వినినంత - చలనమ్ము

గోల్పోయి - నీ ** - చరణాల - చెంతను

పులకించి - స్థంభించె - - ***** - ****** ॥ఏమిటీ॥

# హరిఓం కృష్ణం

**చతురస్రగతి : తకధిమి**

హరిఓం - కృష్ణం - కృష్ణం - హరిఓం

హరి హరి - హరి హరి - హరి ఓం - కృష్ణం ॥హరి॥

హరినా - మామృత - మధురిమ - గ్రోలని

జిహ్వా - యెందుకు - యెం** -దుకు **

హరిహరి - హరియని - వోరార - పిలువని *

ధన్యత - కనరా - దా ** - **** ॥హరి॥

మురళీ - ధరుని * - కమనీయ - రూపము

కాంచగ - లేని * - కన్నులు - యెందుకు

యెందుకు - యెం ** - దుకు ** - ****

మురళీ - కృష్ణుని - పదపద్మములకు

పూజలు - సేయని - కరములు - యెందుకు

యెందుకు - . . . . . . . . . . . . . . . . . .

జగదా - ధారుని - దివ్యమ-నోహర

మురళీ - ధరుని * - వినుతిం-పలేని

కలము * - గళము * - యెం ** దుకు **

యెం ** - దుకు ** - యెందుకు - యెందుకు ॥హరిఓం॥

# కృష్ణా

చతురస్రగతి - తకధిమి

2 వ కాలం భీమ్ ప్లాస్ రాగము

నీ ** - నామము - గానము - సేయగ
నే ** - గాయకు - డనుగా - ను ***
కృష్ణా . . . . . . . . . . . . . . . . . . . .
నే ** - గాయకు - డనుగా - ను *** ॥నీనామము॥

నీ ** - లీలలు - స్తుతించ - గా **
రా * వు - వాకు * - కవితలు - ****
నీ ** - దివ్యమ - నోహర - రూపము
చిత్రింత - మన్న * - **** - ****
నే ** - గరువగ - లే * దు - ****
చి * త్ర - లేఖన - ము *** - **** ॥నీ నామము॥

అయినా - . . . . . . . . . . . . . . . . . . . .
విం * డు - మనసుతో - సంకల్పించితి
నీ - పద పూజలు - పే ** - యగ **
నా ** - **** పూజల - లోన *
లోపము - కలిగిన - కోపము - గొనకుమ
గోపాల - కృష్ణయ్య - గోపాలకృష్ణయ్య
గో ***పా * ల - కృ * ష్ణ - య్య * * ! ॥నీనామ॥

# యెంత మధురమురా !

మిశ్రచాపు గతి - తకిట - తకధిమి

రాగం : హంసధ్వని

యెంత - మధురము -- యెంత - మధురము

రా * - **** ---- ***- ****

శ్రీ * - కృష్ణా నీ *.- నామము

*గమనిక : ఏదేవుని పేరు కావాలంటే ఆ పేరును గానము చేయవచ్చు*

(శ్రీ * - రామా) (శ్రీని - వాస*) (అ ** - య్యప్పా) (ఓ * -దేవ* )

యెంత - మధురము - రా * - ****

॥యెంత॥

పా* - లు * పం—చా * - దారల—క ** - న్నా ** —*** -****

పవ * - ప*తొావ - ల ** - కన్నా - *** -**** - *** -****

॥యెంత॥

నీ * - నామము—తలచి - నంతనె—మనసు - నందలి—కలత - లన్నీ

మటు * - మా*య—మం* - ది *** —

తెలియ - రాని * — పరవ - శముతో ———————

తమ * - వు * వుల — కింత - లందు -***......

॥యెంత॥

నీ ** - తలపే—మధుర - భా*వ—నా * -****—*** -****

యీా * -****—మాన - వాళీ—మను * - గడకు * —మహా-పా. * ధ

నా * -****— యీా * - భావన—యీా * - సాధన—లే* -కుంటే

పాకీ॥ (నరజీవనమే యెడారియై బ్రతుకు

మోడు వారి చేదు విషముగ మారిపోదా...........) ॥యెంత॥

ఆంధ్రజ్యోతి

తమసో మా జ్యోతిర్గమయ

జనవరి 19, 1987 సోమవారం

శాస్త్రవైద్యుని మంజుల గానహేల

# శాస్త్రవైద్యుని మంజుల గానహేల

## (పై ఫోటోలోని వాక్యాలు యధాతధంగా)

"యీ వనమంతా వివదించే
రసమయ సంగీత గీతిక
ఎక్కడి నుండియొ తెలియక
తికమకపడుచుండె రాధిక వీ ఆరాధిక".

ఒక రసాత్మకరాగం రవళించింది. ఇటీవల ఒక సాయంత్రం కొవ్వూరులోని గోష్పాదక్షేత్ర గీతా మందిరంలో ఒక గంభీర గళం గేయాలు పలకించింది. విశేషమేమిటంటే కొవ్వూరు ప్రభుత్వ ఆసుపత్రిలో డిప్యూటీ సివిల్ సర్జన్‌గా పనిచేస్తూ రోగాలను, గాయాలను నయం చేసే డాక్టరే ఈ

గేయాలను మధురంగా అలపించడం. ఆయన పేరు శ్రీ కూడుపూడి సత్యనారాయణ మరో చెప్పుకోదగిన విషయం రాత్రింబవళ్ళు చికిత్స, శస్త్ర చికిత్సలలో తలమునకలుగా వుండే ఈ డాక్టర్ స్వయంగా గీతాలు రచించి శాస్త్రీయమైన బాణీలను కూర్చి పాడడం.

ఆయనను కేవలం ఒక డాక్టరుగా మాత్రమే గుర్తించిన ప్రజలు ఆయన పాడుతుంటే ఒక అద్భుతం జరుగుతున్నట్టుగా చూస్తుండిపోయారు.

"రాదేల కరుణ నీకు రాధారమణ' గీతాన్ని భీమ్‌పలాస్ రాగంలో ఒక భక్తుని ఆత్మపరివేదనను కడు ఆర్ద్రంగా పలికించారు. అలాగే కల్యాణి రాగంలో రవళించిన 'మురళి గానవిలోలా ఏమిటి ఈ పులకింత, ఎన్నడెరుగని వింత' గీతం సంగీత దషకం నుంచి ఒలికిపడిన మధు బిందువులా తోచింది.

ఈ మాయమేయ జగాన్ని సందర్భోచితంగా మాయామాళవ గౌళరాగంలో ఒక అంతర్ గ్లానితో పాడిన గీతం.

ఈ బ్రతుకే ఒక అద్భుత మాయలీల

కనులు మూసి తెరచినంతనే విభ్రమణ హేల' అందరిని అలరించింది.

ఇంకా హంసధ్వని, పున్నాగవరాళి తదితర రాగాలలో పాడిన గీతాలు కూడా బాగున్నాయి. ప్రతి గీతానికి ముందు డాక్టరు సత్యనారాయణ వివరణ వాక్యాలు పలకడంతో శ్రోతలకు సులభంగా గీతాల అర్థం అవగాహన అయింది. ఈ కార్యక్రమంలో శ్రీ అబ్దుల్లా తబలాతోను, శ్రీ రమణయ్య హార్మోనియంతోను సహకరించారు.

*స్పాట్‌న్యూస్, కొవ్వూరు. జనవరి 1-19-1987 శనివారం*

**ముందుమాట :** శ్రీ కృష్ణ సాక్షాత్కారమునకై తన జీవితకాలమంత యెదురు చూసి చూసి తుదకు తన జీవిత సంధ్యకు చేరువవుతూ తపించుచున్న ఒక భక్తురాలి నివేదన

## రాదేల కరుణ నీకు రాధా రమణ

రాగం : భీమ్ ప్లాస్,
తిశ్రగతి - తకిట

రా * దేల - కరుణ - నీకు రాధారమ - ణ *****
ఎంతవేడి - న కూడ ** - రాధా రమ - ణ **** ॥రాదేల॥

మూయలేదు - కంటిరెప్ప - క్షణముయైన - ను ****
వేయలేదు - యెడద తలుపు - గడియయైన - ను *****
ఒక్క *** - ఘడియయైన - ను ***** -
యే * వేళ - వత్తువాయను - తలపులతో - ****** ॥రాదేల॥

దినము దినము - పండు ఫలము - గొనివచ్చి * - నీ * రాక
కెదురు చూడ - . . . . . . . . . . . . . . . . . . . . . .
కరిగిపోయె - ప్రాయము ** - తరగిపోయె - ఓ * పిక *
తొలగుచుండె - కంటిచూపు . . . . . . . . . . . . . . . .
కొడిగట్టుచు - మండెనిక
నా జీవన - దీ * పిక * . . . . . . . . . . . . ॥రాదేల॥

నింగిలోని - తారలేమొ
పిలుచుచుండె - రమ్మనుచు *
నేలతల్లి - ఒడిని చూపి
నిదురవొమ్మనగ - వేగిరపడె
నిలువలేను - నడువలేను
సా*గించ - లే * నింక
యీ * నిరీ - క్షణ *** -
కన్నుమూయు - లోన నాకు
దరిశన మీ - యగరమ్మ ॥రాదేల॥

**ముందుమాట :** శ్రీ కృష్ణపరమాత్ముని రాకకై యెదురు చూచుచున్నది రాధ. కొద్ది దినముల నుండి మాత్రమే కృష్ణ సాక్షాత్కారము లభించకపోయినను అది యెన్నో యుగములైనట్లు ఆవేదన చెందుచున్నది. రాధ. అంతలోనె అరుదెంచుచున్న తన ప్రభువును కన్గొని

## కృష్ణయ్యా యెన్నినాళ్ళకెన్నినాళ్ళకు ?

**తిశ్రగతి - తకిట - తకిట,**
**రాగం : చక్రవాకము**

ఎన్నినాళ్ళ - కెన్నినాళ్ళ - కు *****- . . . . . . . .
ఓ * ప్రభో - కృష్ణయ్య * - యెన్నినాళ్ళ - కెన్నినాళ్ళ - కు ॥ఎన్ని॥

యీ రా * ధ - పై **** - నీ * చరణ - దా * సిపై
కరుణ కలిగె - నీ నాటికి - . . . . . . . . . . . . ॥ఎన్ని॥

నీ **** - సందర్శన - భాగ్యమునకు
కంటిరెప్ప - మూయకుండ - హృదయకవా - టములు తెరచి
క్షణమే యొక - యుగముగ ** - నిరీక్షించు - చుం * టి **
యే **** - క్షణమునైన - వత్తువని * - . . . . . . . . . . .
వనిపూచిన - పూలన్ని * - కొనివ * చ్చి - చల్లుచుంటి
యనవరతము - వాకిలిముం - గిలోన * - . . . . . . . . .
యీ **** - కటికవేల - రాపిడిలో - నీ ****
అందా*ల - పాదాలు - కందిపో * - తా * యని * ॥ఎన్ని॥

నీవు వచ్చి - రా * గా * - నే * - . . . . . . . . . . . .
యెన్నెన్నో - చేయాలని - యేమేమో - చెప్పాలని
కలలు కన్న - నా ** కు* - మాటలు తడ - బడుచుండె *
కా*ల్సేతు - లాడకుండె - - - - - - - - - - -
నీ పదపద్మములను * - కడుగనుంచి - న ******
ఆ **** - జల పాత్ర - నెక్కడుంచి - తో *మరి*
సజలనయన - ధారలు వెలు - వడగా ** - . . . . . . . . . .
జలజలరా - లె ***** - ఆనం * ద - భాష్పాలన - భిషేకించి
కడుగుచున్నాను పాదాల - మన్నిం*చ - నయ్యా ** ॥ఎన్ని॥

**ముందుమాట :** అది సుందర యమునా నదీతీరము ఆ తీరమున ముగ్ద మనోహర మురళీధరుడు తన పిల్లన గ్రోవిని మోవిపైనవిడి. మధుర సంగీతమువాలపించుచున్నాడు. ఆ మధుర మురళీ రవళిని వినీవినినంతనే

# మురళిని మోవిని బూన

(నృత్య గేయం) రాగం : హిందోళా - తిస్రగతి

తకిట - తకిట 3 వ కాలం

యమునానది - సైకతాన - స్వామి మురళి - ని *****

మోవిని పూ - న ***** - మోవిని పూ - న ***** ॥యమున॥

పరగువనట - చేరగ ** - అడుగులు తడ - బడుచు ***

పడుచు ** - లేచుచు ** - పరుగిడెనొక - పడుచు ***

తినెడి తినెడి - తిండి విడచి - యెంగిలిచే-తులు యనెడి *

యింగితమును - మరచి *** - అదె పవిగా - వడివడిగా

వెడలిపోయె - నొకవయ్యా - రీ **** - ****** ॥యము॥

ఆకు వక్క - లందుకొనగ - తెరచిన యొక - మగని నోరు

అటులె విలచి - పోయె ** - మురళి రవళి - వినిన తోనె

బిరబిరయని - పరుగులిడెడి - మగువను కను - గొనుచు ***॥యము॥

**సాకీ :** (యెన్నడు యీదుటెరుగని భామలు కూడ అంతటి యమునలో దూకి ...... ఆవలి తీరముచేరి తమ కమల కోమల పదములన్ రాళ్ళు ముండ్లు ... గ్రుచ్చుకొని ..... రుధిర ధారలేరులై పారినన్ పరుకు కొనక...)

పరుగులిడిరి - గోపికలా - కృష్ణుని పద - సన్నిధికి *

పూజాకుసు - మములగ** - ఆత్మార్పణ - చేసికొనగ ॥యమున॥

ముందుమాట : ప్రభో సర్వేశ్వరా అప్పటికప్పుడే దుస్సంఘటనల కూర్చినోట మాటరాని విధంగా మూగపరిస్థితిని కల్పిస్తావు. మరి ఆ మరు నిముషంలోనే శుభాన్ని చేకూర్చి మమ్మ గలగలనవ్వించి పలికిస్తావు

# అంతా నీ లీలయే ప్రభో

చతురస్రగతి, తకధిమి

పా*ట - పా*డె -* గళము - ఆగిన
ఆ*గి - పోయిన -* గళము - పలికిన
అంతా - నీ లీలయే * - ప్రభో
. . . . . . . . . . . . . . . . . . . . . ॥మొన్న॥

మొన్నను - పలికిన - గళమాగిపోయెను
నిన్నను - **** - నిన్నేమి-టనను*
ఆ ** - మూ*గపోయిన - గళమే - మరల *
గలగల - మవిపలికె - నే*డు - **** ॥పాట॥

సుఖదుఃఖముల * - * వెలుగు - నీడల
మా*ర్చి - కూర్చే - నీ క్రీడల **
నవ్వించి - యేడ్పించి - యేడ్పించి నవ్వించు
నీయాటల ** - మేమొక - పా * వులము
పామర - జీవులము . . . . . . . . . . . . .
నీ*దు - లీలా - వినోదమందున
పతమత - మందే - మనుజులము ***
యేచింతలు లేక - నీ దివ్య - పాదాల
కడను * - **** - కడతేరి - పోనిమ్మ
మా జీవితం * - హేగిరి - ధారీ ! ॥పాట॥

# సృష్టిలో రేణువును నేను

**సాకీ (ప్రభో మురళీధరా కృష్ణా), తిశ్రగతి : తకిట - తకిట**

నీయనంత - సృష్టిలో - రేణువును ∗ - నే∗ను∗∗
నీ వేణువు - స్వరములో - మైమరుతును - మే∗ను∗∗ ॥నీయనం॥

కోట్ల కోట్ల - గ్రహములతో - అవధులు లే - క ∗∗∗∗∗
పరిధులు లే - క ∗∗∗∗∗ - కిటకిటలా-డే ∗∗∗∗
దుర్నిరీక్ష - విశ్వంలో - సౌరకుటుం - బపు పరిధిలో
చిరుగ్రహం - యీ ∗∗∗ - భూ ∗ మండ - లం ∗∗∗∗॥నీయనంత॥

యీ భూవిలో - వెలసిన ∗∗ - కో∗ట్లాది - జీ∗వ∗∗
జాతులలో - మనుజజాతి - యొకటి ∗∗∗ - ∗∗∗∗∗∗
ఆ ∗ మనుజ - కో∗టిలో - నీయనంత - సృష్టిలో ∗
చిరురేణువు - నే∗ను ∗∗∗ - పరమాణువు - నే∗ను∗∗∗॥నీయనంత॥

నీ వేణువు - స్వరములో - నీ పదముల - స్మరణలో
నామేనును - మైమరచి - వాయువికివి - విడచి ∗∗∗
ఐక్యమంద - విమ్ము ప్రభూ - నీయనంత - రూపములో
అఖిలాండ - కో∗∗టి ∗ - బ్రహ్మాండ - నా∗యకా ॥నీయనంత॥

# నీ పాదపూజకు

ఖండగతి - తకతకిట

నీ పాద - పూజకు * - ప్రభవించి - నట్టి **
కుసుమమును - కానిమ్మ - ననుదేవ - దేవ ** ॥నీపా॥

ఆ కుసుమ - మందదలి * - భక్తియను - సౌరభము
విడనాడి - పోనీకు - నాజన్మ - పర్యంతము
యెడతెగని - విశ్వాస - మనెడి ** - మందార
మకరంద - ము **** - యిగిరిపో - నీయకు *
యీ బొందు - లో **** - ప్రాణాలు - నిలుచునం
దాకా * .................... ॥నీపాద॥

సంసార - సంగ్రామ - జయించి - నట్టి **
సుడిగాలు - లేతాకి - చిందర * - వందర *
చెందగ - నీయకు * -
విషయవాం - ఛలుయనెడి - పసువులు * - దరిచేరి
నాశమం - దగనీకు - యీకుసుమ - ము ****
నీ చరణ - సన్నిధిని - చేరునం - దాక ** ॥నీపాద॥

**ముందుమాట:** ప్రభూ ! తిరుమల వాసా - మనసారా నిన్ను స్మరించుకోవాలని నీ ముందు నేను నిలిచి యుంటే వాయేకాగ్రతను భగ్నంచేస్తూ, నడునడుముందుకు నడు అంటూ గద్దిస్తూ, అరుస్తూ యుంటాడు పూజారి.)




**తకధిమి - చతురస్రగతి**

ప్రభో........... ఆత్మను - నే**ను***

పరమాత్మ - నీ * వు - మన ** - యిరువురి - నడుమ *

యెందుకు ? - యీ రాయబారి - పూ** -జారీ

॥ఆత్మ॥

నిర్మల - మనసున - నినుకొలుచుకొనుచుండ

కలిన * - చిత్తము - తోడ * - ముందుకు - జరుగు*జరుగంటాడు

తిరుగు * - బాటును - నే* మ - చేయుద.మనుకొంటె

నీ ** - వేమను - కొంటావా యనెడి - సందియమగుచుండె

॥ఆత్మ॥

పెదవులపైనుండి - యాంత్రిక - రీతిని

మం * త్రముల ** - చదువుటెగాని

యీ జడుడెరుగడు - నీకును - నాకును

గలయను బంధం - నా ** - నిర్మల - మదిలో

నిరతము - కొలువుండి - నను తెల్పుచుందువు

బ్రహ్మానం*ద - డోలిక లందున - యనుసత్యమును*

॥ఆత్మను॥

# ఉన్నవెన్నొ నామాలు రామానీకు

2వకాలం - తిస్రగతి - తకిట

ఉన్నవెన్నొ - నామాలు * - రామా నీకు - ******
ఆ **** - వున్నవన్ని - తెలియవు ** - స్తుతిచేయ - నా*కు**

॥ఉన్న॥

రమ్యమైన - రెం*డక్ష - రములె *** - రామాయను
రెండక్షరములె *** - యీ **** - జగతికెల్ల
రక్షయని * - తెలియును - నాకు

॥ఉన్న॥

అనంతకోటి - నామాలతో -**** అ- నంతకోటి
రూపాలతొ - వెలసిన ని - న్ను . . . . . . . . . . . .
స్తవన చేసి - మెప్పించగ - కవితలు రా-వు ** నాకు
కవితలు రా-వు . . . . . . . . . . . . . . . . . . . . . .
మధురమైన - నీ నామము - గానముసే - య *****
సం*గీత - జ్ఞానమునే - గరువగ లే - దు *****
నిర్మలమతి - తో * విన్ను - రామా ** - రామాయని
పిలుతును ** - పవలురేయి - విడివడక * - యెడతెగక*
నిరతమునిను - కొలుతును ** - కరుణిం*చి - కాపా *డ
వయ్యా ** - ఓ **** - రామయ్యా- . . . . . . . . .

॥ఉన్న॥

# కోదండరామయ్య

చతురస్రగతి - తకధిమి

కోదండ - రామయ్య - కొలువున్న - చోట *
శతకోటి - శుభములు - వెలసి - ల్లును **    ॥కోదం॥

జానకి - రామయ్య - కృపయున్న - చోట *
చేరగ - నేరవు - యీ*తి - బాధలు
దశరధ - రాముని - మహిమను - తోడ *
హిమముగ - మారును - బడబా - నలమే    ॥కోదం॥

పతితపావన * - సీతా - రాముని
పదముల - ధూళితొ - పడతిగ - మారెను
కఠినశి - ల ..................
యివకుల - సోముని - దీవెన - లంది *
మునియై - పోయెను - క్రూ*ర - కర్ముడు
బోయడు - కూ*డ ...............    ॥కోదం॥

**ముందుమాట :** ప్రభో యీ సకల చరాచరజగతి యందలి ప్రతి వస్తువు ప్రతిజీవి నీకు ప్రియమైనవే. చిన్న పెద్ద, పేదధనిక, వ్యత్యాసాలు నీకు లేవు. ప్రభో కనికరించి స్వీకరించు !

# యీగరిక పూవును

**చతురస్రగతి - తకధిమి - 2 వ కాలం**

చే ** - కొనరా - స్వామి - యీ గరి*క - పూవును
నీ సృష్టి - క్రమమున - ప్రభవిం - చి ***
యేఘనత - నోచని - యీ గరిక - పూవును

॥చేకొ॥

మల్లె * - పూవును - గాను * - మొగలి * - రేకును గాను *
బంతి * - పూవును - గా * ను చామంతి - నేగాను

॥చేకొన॥

బంగారు - పూలతో - పూజ * - పేతామన్న
భా*గ్య - వంతుడ - గా*ను - ****
అక్షర - సుమముల - మాలలే - తామన్న
కవివరు - డను గాను . . . . . . . . . . .
గాన * - మాధుర్యమున - అలరింతమన్న
గా*య-కుడను గాను
నీ సృష్టి - క్రమమున - ప్రభవిం - చినట్టి
సామాన్య - మానవుడ . . . . . . . . . . . ॥చేకొ॥

# శివమే సత్యము

చతురస్రగతి - (తకధిమి)

శివమే - సత్యము - శివమే - నిత్యము
శివమే - సుందరము * అదే - అందరి - అంతిమ - గమ్యము॥శివమే॥

శివశివ - శివయను - రెండక్షరములె
జగతికి - మూలము ప్రాణము
శివశివ - శివయను - రెండక్షరములె *
సుగతికి - ప్రగతికి - సోపానము ** ॥శివమే॥

శివశివ - శివయను - రెండక్షరములె *
శిష్టుల - వర్ధిల - చేసే - వరము *
శివశివ - శివయను - రెండక్షరములె
దుష్టుల - శిక్షించు - దావానలము * ॥శివమే॥

శివమే - . . . . . . . . . . సకలచరాచర
భూతాలవాడించు - చైతన్యము **
శివనామమే - . . . . . . కేశవ నామమే . . . . . . .
ఇహము - పరము * - సఫలత
గూర్చే - కల్యాణ - ప్రదము
కల్యాణ - పథము . . . . శివమే॥

**ముందుమాట** : అది 1995 వ సంవత్సరం డిశంబరు 14 వ తేది ఉదయం 6.08 నిముషాలు.నిద్రలో కృష్ణుని ధ్యానిస్తున్నట్టు కృష్ణుడు సాక్షాత్కరించినట్టు కలవచ్చింది. యీ గేయమును నిద్రలోనే ఆలపిస్తున్నాను. కళ్ళు తెరచిచూసాను. యిది కలయని. ఆ ఆలాపన సాహిత్యం కలలోనే ఉద్భవించిందని అప్పుడు గ్రహించాను. పల్లవి మొదటి చరణాలు కలలో అచేతనావస్థలో పుట్టిన సాహిత్యం. దాన్నిమనన చేసుకుంటూ కాగితంపై వ్రాసాను. చివరి చరణం మాత్రం మెలకువ వచ్చిన తరువాత (చేతనావస్థలో పూరించాను. యిది యీ గేయానికి ఉపోద్ఘాతం. ఇది నిజంగా జరిగిన వాస్తవం.

## కృష్ణ అందుకొనుమ వందనములు

చతుస్రగతి - తకధిమి

పలికెద - పదివేల మారులు -- యిపుడే *
కృష్ణా...... కృష్ణా...... కృష్ణయటంచు...... ॥పలికెద॥

యీ ** - వేకువ - ఝామున - వచ్చిన కలలో
వినతులు - సేయుచు నుంటినట .......
యిరుకరములను * - జోడించి ***
యికముందు ముందు - వం*దనములను - సేయగలనో *
లేదో మరి ** - యిపుడే యీ ఘడియలోనె
సే*యుచుంటిని - నేశత సహస్ర - వం*దనములు*
అందు*కొనుమని - వే*డుచుంటి-నట ***
నా ** - గళమును - సారించి - పలికెదనోమరి
లేదో యికముందు ముందు - నీ దివ్య నామమును ***
నేడే - యీ*నాడే - పలికెద - పదివేల - మారులు
కృష్ణా **** - కృష్ణాయటంచు - నాతనివితీర
గతరాత్రి యందు - నిదురించుముందు
మరచితినో ప్రభు - నీనామ స్మరణం
మన్నించు మా ప్రభు - నాయపరాధం
నిదురించుటనగా - ఒకలాంటి మరణం
మేల్కొనుట మరల - పునరభిజననం ॥పలికెద॥

**ముందుమాట:** కోడికూసింది తూర్పు తెల్లవారుతున్నది. "లేవరా ! ఓ మావా లేవరా!!" అంటు నిద్రలేపుతున్నది; కొత్తగా పెండ్లయిన ఒక పల్లెపడుచు తన భర్తను)

# లేవరా ఓ మావాఁ

జానపదగేయం

**భూపాల రాగం : తిశ్రగతి - తకిట - 2 వ కాలం**

కొక్కురో ✻ - కోఅంటు ✻ - తొలికోడీ - కూసిందీ . . . . . . .
తూ✻✻రుపు - కొండలపై - తెలతెల్ల ✻ - వా✻రింది
లేవరా ✻ - ఓ ✻ మాఁవ - లేవరా.. లేవరా . . . . . . . . ॥కొక్కురో॥

అత్తమాఁ - వలు లేచిన - అలికిడే ✻ - అవుతుంది ✻
యింకొక్క ✻ - ముద్దంటు ✻ - బేరాలను - సాగించక
లేవరా ✻ - ఓ మాఁవ ✻ - లేవరా . . . . . . . ॥కొక్కురో॥

బద్దకవేఁ - త్తుందంటు ✻ - మారామును - సేయక ✻✻
చద్ది✻య - న్నపు మూటను - సర్దేసి ✻ - యుంచాను ✻
పొద్దు ✻ పొడ - వకముందే - పొగతోట ✻ - కడకేగి ✻
బు ✻ ద్దిగ ✻ - నీ పనులు ✻ - సక్క ✻ బెట్టుకో మావా ! ॥కొక్కురో॥

వంకాయ ✻ - కూరొండి ✻ - గోంగూర ✻ - పచ్చడిసే - సి . . . . .
గడ్డపెరుగు - తోడుపెట్టి - పచ్చిమిరప - కాయలతో
పొద్దు ✻ వడి - నెత్తిపైకి - ఒచ్చేటప్పటికల్లా ✻
కమ్మగ ✻✻ - బోజనవేఁ - పట్టు✻ కొ - త్తామాఁవ ✻ ॥కొక్కురో॥

# కోదండ రామయ్య కోటి దండాలు

జానపగేయం - తిశ్రగతి - తకిట

2 వ కాలం మాండురాగం !

దండాలు * - దండాలు * - కోదండా - రామయ్య
కో*టి * - దండా * లు - కోటి దండాలు **** ॥దండా॥

కండలు దం - డలు **** - దండిగ - వున్నను ***
నీ అండ * - లేకుంటే - దండగ్గా * - పోతాదీ * - ॥దండాలు॥

ఆ **** - నీ అండ * - వుంటేనే - . . . . . . . . .
అనుమంతుడు - దాటేను * - అంతటీ * - సంద్రమైన
ఒకే ఒక్క - అడుగులో * ॥దండాలు॥

కండలూ * -దండలూ * -దండిగా - పెంచిన **
రావనా * - బెమ్మకే * - రిమ్మతిరిగి - పోవా *ది
ఆ(**** - యెన్ని తలలు - ఉన్నను * - యెంత బలగ
మున్నను ** - నువ్వు *** - కన్నెర్ర * - పెయ్యంగ *
బూడిదై * - పోనాడు * - . . . . . . .
నీ కరుణా - పో*కి ** - నీపాద * - ధూ*లీ*
తాకీ తా - కంగనే * అంతటీ - బండరాయి
మారీపో-నా*దీ* - అందాల * - సుందరిగ * ॥దండాలు॥

# మరచిపోకు - మా(వా

**సాపుతాళం - తిశ్రగతి - తకిట - తకిట - 2వ కాలం**

**రాగం : చారుకేశ్**

నీ **** - కో*సం * - పరితపించే ప్రాణి - ఒ * క్కటి
ఉన్నదనీ - . . . . - మరచిపోకు - మరచిపోకు - మా*వా*

॥నీకోసం॥

అసలు నువ్వు - పోయేది * - పరదేశం - . . . . . .
అందునా * - నీకేమో - మోగమాటం - . . . . . .
యెపుడుతిండి - తింటావో - యెపుడు నిదర - పోతావో
యే * - మో * - నీ **** - ఆరోగ్గం - జాగరతగ - సూసుకోమా(వా(

॥నీకోసం॥

యెఱ్రబొఱ్ర - గావుండే - విన్ను సూత్తీ ****
కల్లబొల్లి - వగలుసూపి - మాయదారి - మాటలతో
విన్ను వలలో - యేత్తారు * - నీ ఒడిలో - పడతా * రు
జా * గరత - జాగరత * - మా( * - వా( * - . . . . . .

॥నీకోసం॥

వన్నిపుడు * - లగ్గమాడ - కున్న గూ* -డ *****
నీధ్యేసతో - నా **** - మనసం*త - నింపుకొంట
యెదురుసూతు - వే * మ** - నీ *రాక - కొరకు ***
నా హొంటిలో - ఊపిరుం * - దేవరకు * - ******

॥నీకోసం॥

ముందుమాట : (అది మిట్ట మధ్యాహ్నపు వేళ ఆకాశమంతా కారుమబ్బులు కమ్మి చీకటి ఆవహించినట్లైపోయింది. యీపాటికల్లా అన్నం పట్టుకొచ్చే తనయిల్లాలు యెంకి రాక కొంచెమాలస్యమైంది. అంతలోనే ఒక ఉరుము ఉరిమింది తళుక్కుమని ఒక మెరుపు మెరిసింది. ఆ మెరుపు కంటే యింకా కాంతివంతంగా ఒంపుసొంపువయ్యారాలతో, చిరునవ్వుతో తన యెంకి ఒక్కమారుగా ప్రత్యక్షమైంది)

# ఉత్తరాన ఉరుము ఉరిమింది

3 వ కాలం

తక - తక - తకధిమి - చతురస్రగతి

ఉ*త్త - రా*న - ఉరుము * - ఉరుమిం - దీ . . . . . . .
మెరుపుమెరిసింది *** - మెరుపే - మెరిసిం - దీ . . . . .

॥ఉత్తరా॥

ఆ ** -**** - * మెరుపులో*వి వెలుగులన్నీ *
-* తళుకులలన్నీ * - వొం*పు - లన్నీ - సొం * పు - లన్నీ
మగువగ - మా*రి - నా ముందు - నిలిచిం - దీ ** - . . . . . . .

॥ఉత్తరా॥

పుడిగాలి - వీచిం - దీ ** - జడివాన - కురిసిం - దీ **
జడివాన - లో తడిసి - కడిగిన - ముత్యపు
శోభల - చిందించి - నామది - నలరిం - చిం** -దీ**
యీ పుడి -గా*లి - ఆ జడి - వా*న - తీ * ర్చ - లే * దు
చల్లార్చ - లే*దు - రగిలే - పొగల * -* వగల - పెగల *
నా చెలి - వెచ్చని - కౌగిల దక్క * . . . . . . . . . . .

॥ఉత్తరా॥

**ముందుమాట :** గోదావరి గట్టుమీద వెళ్తున్న పూజారిగారినెత్తిపైన గాలికి యెగిరెగిరి పడుతున్నది వాని పిలక. ఆది మేకల్ని మేపుకుంటున్న కుర్రవాడు చిలిపి గంగన్న కంటపడింది. అంతటవాడు ఆ యెగిరి పడుతున్న పిలక కంటెజోరుగా హుషారుగా, వెకిలిగ ఆ పూజారి గారికి విన్పించీ విన్పించనట్టు గంతులేస్తూ యెగురుకుంటూ పాడుకుంటున్నాడు అదిగో చూడండి మరి.

## పిలకయెగిరి పడుతోంది

జనపద గేయం

**తకిట - తకిట - తిస్రగతి,**
**2 లేక 3 వ కాలం**

గోదారి * - గట్టుమీద
పూజారి * - నెత్తిపైన
పిలక యెగిరి - పడుతోందె - సిలక
పలకరించి - పోదామె * - సిలక ॥గోదా॥

ముందొచ్చిన - తనకన్న *
వెనకొచ్చిన - పెళ్ళాన్నే
నెత్తినెట్టు - కున్నాడని
అలుకచెంది - పోయింది *
యెగిరి యెగిరి - పడుతోంది
యెగిరి యెగిరి - కొడుతోందె పిలక ॥గోదా॥

మనువాడిన - నాటినుండి - తన మాటను - మరచిపోయి
గుడిలోని * - పువ్వులన్ని - యింటావిడ జడలోనే
పెడుతుంటే - జగడానికి - తలబడెను * - పిలక *** ॥గోదారి॥

అలుకగొన్న - ఆ పిలక *
పైకిపైకి - గాలికెగిరి
నున్నటి ఆ - నెత్తిపైన
మొత్తుతోంది - సుత్తిలాగ
అయ్యబాబో - యిడవకుండ
సమయము చే - కూరినపుడు
పలురకాల - తాళాలతో
పిలక . . . . . . . ॥గోదారి॥

(ముందుమాట : బావామరదళ్ళ సరస - విరస గీతం)

# ఓ సిన్నదాన

జానపదగేయం

**తిశ్రగతి - తకిట - తకిట - 3 వ కాలం**

మావ : ఓ ****- రంగారు * - పొంగారు * - సిన్నదాన
బంగారు * - సింగారు * - మనసున్న * - దాన ** ॥ఓ రంగారు॥

మరదలు : ఓ ****-కంగారు * - గింగారు *
కంతిరి * - బింతిరి * - మా*వా* . . . . ॥ఓ కంగారు॥

మావ : సందెపొద్దు - యేలకాడ - కందిసేను - కాడకొచ్చి
నీ అంద * - సందాలతొ * - యిందుసేసి - పోరాద* ॥ఓ రంగారు॥

మరదలు : ఓ **** - కంతిరిబింతిరి - మాఁవాఁ . . . . . . .
నీ **** - కొంటె కోణంగి - మాటలు సేతలు - కట్టిబెట్టి
ఆ **** - మూడు ముళ్ళు - మెడలో యేసి - రమ్మంటే
కందిపేను - కాడ కేంటి ? - సరాసరిగ - నీ ****
సందిటిలోకి - ఒచ్చేత్తర - మ్మాఁవాఁ . . . . . . .

మాఁవ : ఆ **** - మూడు ముళ్ళు - యెయ్యడానికె - మంగల సూత్రం
పెయ్యించి * - మూడుయేళ్ళ - నాటి నుండి - ఆలురెడిగ
జేబులొ పెట్టుకు - తిరుగుతువుంటె -
నీకంటె * - పెద్దోడి * - పెళ్ళవ్వ * - కుం*డ*
యెట్టాగ * - నువ్వు *** - మనువాడతా * - వంట *
మా * అమ్మ - తిడతా * - వుండా * దె - ఓ పిన్నదాన
ఆ **** - యెంతమంది - పిల్లల్ని * - సూపించి-నాకూడ
నచ్చలేదు - అతగోడికి - ఆ*డి** - పెళ్ళయ్యే
లో*పల * - పళ్ళన్నీ * - ఊడిపోయి - ముసలోళ్ళ
మైపోతా - మే . . . . . . . . . . . ॥ఓ రంగారు॥

# లేతతమలపాకులాంటి చిన్నదానిరా

(జానపద శృంగార గీతం) తకిట - తకిట

చిన్నది : లేత తమల పాకులాంటి - చిన్నదాన్ని - రా ****
ఓ మాఁవ * - మోటుసరస మాడబోకు - రా **** ॥లేత॥

మాఁవ : యెండువక్క_లాంటి ఉక్కు_మనిషినే * -చినదాన *
యీ **** - వక్కపక్క - నుండకుంటె - ఆ ****
లేత తమల - పాకులెందు_కే **** - చినదాన *
న*మ్ము దో-చినదాన . . . . . . . . . . . . . . . . ॥యెండు॥

చిన్నది : వక్కపక్క_నుండాలని - మరీ అంత - బిగి కౌగిలి_తో నన్ను *
బంధించి యేసి ఉక్కిరి - బిక్కిరిచేసెయ్యకు మాఁవ . . .

మాఁవ : బిగి * జిగీ - లేకుండా - బంధించక - ఒదిలేత్తే
మజాయెక్క-డుంటుందే - చినదాన * - ఓ చినదాన

చిన్నది : అదిగదిగో - ఓ మాఁవ * - యెంత పెప్పి_నా నువ్వు*
యినకుండ * - మెత్తని నా - బుగ్గల్ని * - గిల్లుతా * - వెందుకని*

మాఁవ : పాలొత్తా - యేమోనని - సూద్దామని - పించిందే
తేనె మాత్ర వొత్తుందని - తేలిపోయిం_ దిప్పుడు *
చినదాన * - న*మ్మదోచినదానా !

చిన్నది : లేత ॥ . . . . . . . . . . . . . . . .

# సింగీ ఓ సింగీ

జానపదగేయం

**తిశ్రగతి : తకిట - తకిట - 3 వ కాలం**

అతడు : సింగీ ఓ - సింగీ ** - సెయ్యి సెయ్యి - పట్టుకొని *
బుజం బుజం - రాసుకొని * - పట్నవెల్లి - పోదావే ॥సింగీ॥

పొగబండి * - యెక్కేసి * - వాలిటేరు - టేసనులో
వాలి *** - పోయి *** - సిటీబస్సు - యెక్కేసి * -
సిటికెలో * - హొయిజాగు * - సుట్టేసి * - సిందియా *
కంపెనీ * - ఆరుబర్లలో- యున్న * **
మేడల్లాంటి - ఓడలు సూసి - ఒడలేమరి - పేద్దావేఁ ॥సింగీ॥

కింగు - జార్జి ఆసుపత్రిలో - పెంగుపెంగు - మూంటూ వడిపె
నరసమ్మల - ను ***** - హొద్దికాన్ని - వేరుసుకొవె
డాకటెరుల - సూసి ** - వాలిటేరు - అప్పులేండ్సులో
యూనవర్సిటి - సూసుకొంటు - కూవిరాగాలు - తీసికొంటు
బీడీలు - కాలుసుకొంటు - బీపీకెలి - పోదావేఁ ॥సింగీ॥

యెగిరి యెగిరి - పడుతుండే - సవుద్రం * - కెరటాల్లో
కేరింతలు - కొడుతు మనం - తానవాడు - కుందావేఁ
అప్పన్నా - తనామనా - మారోరి * - బైరవ్న - అప్పుడు **
రిచ్చాబండి - సేసుకొని ** పివేమాని - కెలదావేఁ ॥సింగీ॥

**ముందుమాట:** పెళ్ళాం నూకాలమ్మ చుట్ట చక్కగా వెలిగించుకొని కాల్చు కుంటోంది రోడ్డుప్రక్క గుడెసె కాడ. మొగుడు సింహాచలం కూడ తన జేబులోంచి బయటకు తీసాడు తన జానెడు పొడుగున్న చుట్ట. నోట కరచి దాన్ని పెళ్ళాంచుట్టతో ముట్టించుకుని కాలుస్తున్నాడు. మధ్యమధ్యలో అది ఆరిపోతూ వున్నది. మరల మరల దాన్ని అంటించుకుంటూ చివరకు చిర్రెత్తి పోయి అంటున్నాడు సింహాచలం గంతులేస్తూ

# ఎలగవేంటే సుట్ట నూకాలమ్మ

(జానపదగేయం) మాండురాగం, తిస్రగతి : తకిట

తస్సాదియ్యా - తస్సాదియ్య - ఎలగదేంటే సుట్ట
నూకాల మ్మ ** ఓ * - నూకాల- మ్మా ****  ॥తస్సాదీ॥

నీ సుట్ట * - సూత్తేను * - గుప్పుగుప్పు - మంటు యెలిగె
యెంతవూ * - దినగాని * - నా సుట్ట * - యెలగదేంటె
నూకాల - మ్మ * ఆ ** - యెలిగిసావ - దేంటే నూ - కాలమ్మ *॥తస్సాది॥

ఆ **** - పేక్టరీ * - గొట్టంలా - గుప్పు గుప్పు - మంట దంటు
లంకపోగా - కంటు * నా - కంటుగట్టి - నాడే ** - నాయుడోరి
సుబ్బయ్య * - ఓరిబా * - బోయ్యిుంది - యెంతవూదినగాని *
అంటుకో * దేంటొ గాని - మాయదారి - దీ ****  ॥తస్సాది॥

ఆ **** - రొట్టెముక్క - లేకపోతే - పో*యె**
వాడెవైన - సుట్టముక్క - లేకపోతె . . . . . . . .
బండినడిపి - సావదే * - నూకాల - మ్మా ****
కాలుసేతు-లు * నాకు* - పచ్చుపడి - పో * యి**
మాయదారి - బుర్రలో * - సిర్రుబుర్రు - మంటు ***
పరుగులెత్తు - తుంటాయే - మోటారుబ - ళ్ళు ****
ఇప్పుడు *** - బుద్దొచ్చి - నాదికాని - యికమీదట - సచ్చినా *
నాయుడోరి - కొట్టుకాడ - సుట్టముక్క - కొనబోనే
నూకాల - మ్మ ** ఓ ** -నూకాల - మ్మా ****

**ముందుమాట :** యలమంచిలి దగ్గర ఒక పల్లెటూరి నుండి విశాఖపట్నంపోయి ప్రాణాపాయస్థితిలోయున్న తన బిడ్డకు మందులు తీసుకురావాలి పాపం రాంపండు.

# పొగబండి లేదంట

**జానపదగేయం : తిశ్రగతి - తకిట - తకిట**

అయ్యబాబో - అయ్యబాబో - అయ్యబా * - బోయ్ ***
పట్నవెల్ల - డానికింక - పొగబండి * - లేదంట ! ॥అయ్య॥

పొగబండి - లేకుంటె * - వాయిజాగు * - పట్టనవె - ట్టాగ
యెల్లాలంట ? -- పొద్దుగూకే - లోపలే * - నేను ***
మందుమాకు - లట్టుకొచ్చి - సంటిదాని - కెట్టాగ *
యెయ్యాలంట................... అయ్య॥

యీ **** - సుట్టుపట్టి - లా **** - పల్లెటూళ్ళో .....
ఇంగిలీసు - మందులమ్మె - కొట్టు ఒక్క - టి ****
లేకపో * - యే **** - ముప్పదీ * - కోసుల దూ-రమున్నా *
వాయిజాగు * - పట్నన - వెట్టాగ * - యెల్లాల **
ఒక్కపూట - లో **** - మందులతో - తిరిగొచ్చి *
సంటిదాని - పేనాలు * - యెట్టా*గ - రచ్చించు * కోవాలం -ట ॥అయ్య॥
ఆ **** - పొగబండీ - లేకపోతె - పో*యే*
మాయదారి - కార్లకిపుడె - సమ్మెలొచ్చి
సావాలా ? గోరుసుట్టు - పై **** - రోకటీ * - పోటల్లె **
నా **** - కొంపకెసరు - పెట్టాల .....
సీటికీ * - మాటికీ * - సమ్మెలంటారు ****
బందులంటారు **** - పవిపాట * - లిడిపెట్టి
కొమ్ములు ** - మొలిసినా * - మొనగాళ్ళ - ల్లే ****
యీదులంట - సికారులే - కొడతారు -
పెజల పే* - నా*లతో - పెలగాటా - లాడతారు ॥అయ్యబా॥

ముందు మాట : పట్టపగలు సరసానికి రాలేదని అలిగిన మావను బుజ్జగిస్తూవుంది. పాపం తాయారమ్మ

# గోరంత దీప మారిందీ మావ

**తిశ్రగతి : తకిట - తకిట**

**2,4 కాలముల కలయిక**

ఊరంత * - మా *** టు - మణిగిందీ - మా(*వా*
నువ్వు - నేనె యిం * క ** - మిగిలిందీ - ****** ॥ఊరం॥

గోరంత * - దీ *** ప - వారిందీ - ******
కొండంత * - దై *** ర్య - వొచ్చిందీ - మా( * వా *
యేటి సెప్పాలన్నా యేటి సేయాలన్న
యెదలోని * - బెదదంత * - సడలింది * - ****** ॥ఊరం॥

అత్తమావలింట - ఉండారు *
ఆడబడుచు - లేమొ - అటు యిటు తిరుగు * - చుండారు*
పట్టపగటియేల - చెట్టాపట్టాలేసుక
అల్లా*రి - చిల్లా*రి - పనులు సేయక **
బుద్దిగుండర - మావా( అంటే **
చిటపటలాడి ** - చిందులుతొక్కి **
మాపటియేలకు * - మాటామంతి ** - లేక ***

మూతిముడుసుకొవి * - తొంగుం - దావు ***** ॥ఊరం॥
యెవ్వరై - వా ఉంటే - యెవ్వరై - వా సూత్తే
తగని సిగ్గు - వా*కు ** - ముంచుకొత్త - ది మా(వా *
నువ్వంటే - వాకే * మొ - సేనాలం - తటి సే(వా
నీమీద * - ఒట్టేసి * - సెప్పుతుండ
అలకలన్ని - మా*వి** - మూతిముడుపు - మ *** యిడిసి
మా*టాడ - రా * మావ - మవసం*త - యిప్పి ***
నువ్వు సెప్పి - న * దావికి - యెదురా*డ - బోవింక * ॥ఊరంత॥

# తెలుకుట్టిందోయి - ఓయి మాఁవ

జానపదగేయం

**చతురస్రగతి - తక - తక - తకధిమి**

ఆమె : అమ్మమ్మో - అయ్యయ్యో - తేలుకుట్టిందోయి - ఓయి మాఁవ

నన్ను తేలు కుట్టిందోయి - ఓయిమాఁవ ** - **** . . . .

అతడు : అయ్యయ్యో - తేలు * కుట్టిందా ఓ పిల్లా నీకు తేలు*కుట్టిందా

ఓ* పిల్లా యెప్పుండు - కుట్టింది - యెందుకు - కుట్టిందె - ఓ పిల్ల

ఆమె : అమ్మమ్మో - జీలకర్ర డబ్బాలో - యేలుపెట్టుతుంటేను -యిప్పుడే

- సటుక్కునా - కుట్టేసి- మాయవయ్యి - పోనాది ఓయిమాఁవ అది

అతడు : ఆ ** - యిప్పుడే - కుట్టింద - యేదీ - సూడనియ్యి

నీ ** - ఒంటిని - కుట్టుటకు - దాని * - కెన్నిగుండెలు

నాకంట - పడితేను - పేనాలె - తీత్తాను - తప్పదియ్య

దాని * - పేనాలు - తీత్తానె - తప్పదియ్య

ఆమె : అమ్మమ్మో - దాని * - పేనాలు తీసేలోపులోనె

నా ** - పేనాలె - పోయే - లాగున్నయ్

ఆ ** - సేతిమీద - కుట్టిందీ సంకలోకి - యెక్కింది

ఆసారి - గార్నడిగి - యే మందో - మాకైనా

యెంటనే - యెయ్యకుంటె - పేనాలు - పోయే - లాగున్నయ్

మాఁవా - పేనాలు - పోయే - లాగున్నాయ్

అతడు : అయ్యయ్యో - పిల్లా - అంతమాట - అనబోకె -

నీ ** - పేనాలు - పోయాక

నేను మాత్ర - వుంటన - బేజారు - తో నువ్వు

కంగారు - పడిపోయి - నన్ను * - కంగారు - పెట్టబోకె

బంగారు - పిల్లా . . . . . . . . . . . . . . . .

ఆపారి - మందుకన్న - పూజారి - మంత్రవయితె

మంచి * - పట్టుయిత్తాది - కానీ . . . . . . . . . . .

పూజారి-గారేమొ - ఊరెల్లి - నారంట - యిప్పుడేమి -

పెయ్యాలో - తోసకున్నది - నా*కు- తోసకున్నది

(క్షణమాగి)

ఆ **-వుండుండు ****-మంచి *- లావుగాను-యెత్తుగాను

ఉన్నమడిసి - యెవ్వరో - యెల్తుండారు . . . . .

అతగాడికి - తప్పకుండ - తేలుమంత్రవొచ్చెవుంటది

సిటికలోనె - పిలుసుకొని - వొత్తానుండు - ఆ ** -

సిటికలోనె పిలుసుకొని - వత్తానుండు

యింత లావుండాడు - సిన్న * - తేలుమంత్రవేఁ - ఆడికి

- రాదంట

యెవ్వరైనా - యింటేను - నవ్వుతారు - అయ్యయ్యో -

నవ్వుతారు.

**ముందుమాట:** నలదని వారించినా తప్పతాగిన మైకంలో గూడ్సురైలు బండిని ఢీకొట్టి కాళ్ళు చేతుల్ని విరగ్గొట్టుకున్న మొగుడికి గడ్డిపెతున్నది పెళ్ళాం

# రైలు బండి ఢీకొడతావా ?

**జానపద గేయం** **తిశ్రగతి - తకిట తకిట**

ఓరి - సచ్చి - నో ＊డా ＊ - యెంత తాగి - తేమట్టుకు
నువ్వెల్లి ＊＊ - గూడ్సురైలు - బండిని ＊＊ - ఢీకొడతావా ? . . . ॥ఓరి॥

రెండుసేతు - లు ＊＊＊＊＊＊ - నలిగిపోయి - ＊＊＊＊＊＊
అక్కడే ＊ - అయ్యాడి ＊ - పోయినా సావకుండ
నువ్వింక ＊ - బతికొచ్చేవు ! - బతికినవ్వాళ్ళు ＊＊＊
నువ్వు సత్తా ＊ బతుకుత ＊ - నన్ను సంప - తుండావు ＊!! ॥ఓరి॥

సీతోటి ＊ - వోళ్ళంతా - సెపతావే - ఉన్నరంట
రైలుబండి - వొత్తంది ＊ - దాటకు పేట్ పారమంట
నన్ను గుద్దివాదంటే అదే యిరిగిపోతదంట
పోర్సుగనువు - ముందుకెల్లి - మందుతాగిన - మత్తులోన
రైలుపెట్టిని - ఢీకొట్టి ＊ - నా＊వంట
పచ్చడై ＊ - పోడానికి - అగ్గిపెట్టి - అనుకుండవ ॥ఓరి॥

చిన్నకాక - మొన్ననే ＊ - కపిలేశ్వర - మొంతివిపై
తాసుపాము - నాడించే - పాములోడి - మాటయినక
“యిదీ గొప్ప” - యిద్దేనా? - నేను ఆడిత్తా”నని
తప్పతాగిన - మైకంలో - ఆఁ పావూ - పట్టుకో ＊ - బోతే ＊＊
ఒక్క కా＊ - టేసిందది - యెంటనే ＊ - నోటమురుగ
కక్కుకుంట - పేనాలిడి - సీసాడే -
కల్లారా - నువ్వు కూడ సూసినా వేగింద ॥ఓరి॥

**ముందుమాట :** అది 1986 వ సం॥రం. ఆగష్టు 15 వ తేదీ స్వాతంత్ర్య దినోత్సవంనాడు గోదావరి నదీమతల్లి కూడ స్వాతంత్ర్యాన్ని ప్రకటించి పైశాచికంగా జడలు విరబూసుకొని ప్రళయ విలయతాండవం చేస్తూ గట్లను కట్లను త్రెంచుకొని, పిచ్చికుక్కలాగనోటమురగలు క్రక్కుతూ ఉరకలేస్తూ పరుగులిస్తూ ఊళ్ళకూళ్ళమాడ్చేసి వేలాది మనుష్యులను మింగేసి అసంఖ్యాక జంతుకోట్లను మృత్యుకుహరంలో త్రోసివేసింది. అట్టిమహోపద్రవంతో తన కొంపకొట్టుకుపోయి ప్రాణాలతో మాత్రం బయట పడ్డానని నెత్తినోరుబాదుకుంటూ విలపిస్తున్నాడొక వృద్ధగిరిజనుడు.

# మాయదారి గోదారి

**జానపదగేయం : తిస్రగతి - తకిట - తకిట 3 వ కాలం**

ఓ***రి - బా*బోయ్ - ఓరి దేవు - డోయ్ ****
గోదారి * - వరదొచ్చి * - కొంపకొట్టుక - పోనాది * ॥ఓరి॥

నేపుట్టీ - పెరిగేక * - యింత వరద - రానేదు *
మాయదారి - గోదారీ - గుప్పుమంటు - పొంగిపొంగి
అద్దరేతిరి - యేలలోన - పిడుగల్లే - పడిపోయా
వనములోన - సుట్టుముట్టి - గూడెమంత - మట్టుబెట్టె ॥ఓరి॥

ఆ **** - జొన్నగింజ - లొదిలేసి
గొడ్డుగోద - లిడిసిపెట్టి - సంటిదాన్ని - సంకనేసి
కుంటిదాన్ని - బుజానేసి - కట్టుబట్ట - లతో*టి*
లబోదిబో - మంటు *** - కొండమీది - కెక్కివాము
పేవాలతో - కొనపేనా-లతో *** ॥ఓరి॥

కొండమీది - కెక్కినాక - తిండిలేదు - తిప్పలేదు
కడుపులొ మం-టలు లేత్తే - వెత్తిన వర - సం కురిపె
పిరిగిన గొం - గలి తీపి - సంటిదాని - వెత్తివేపి
పక్కనున్న - తల్లినడిగి - గుప్పెడు మెతు - కులుయెట్టి
సావకుండ - పదిరోజులు - నెట్టుకవా - త్రేమ ***
యి మానంలొ - యియ్యేలనె - హోరుమంటు - . . . . . . . .
పులిహోరు * - పొట్లలా * - లదేపారు ॥ఓరి॥

# ఎంత జాణవు నీవు గోదావరి

(యిది జానపదగేయం కాకున్నా సందర్భానుసరించి యిక్కడ పొందుపరచడమైనది)

**తిశ్రగతి - తకిట - తకిట**

ఎంత - జాణ - వమ్మ - నీవు - ఓ * - గో * - దా* రీ *
ఓ ..... గో - దా - రీ . . . . . . . . . . . . . . . . ॥ఎంత॥

నిన్న - కాక - మొన్ననే * - వే * లాది - మందిని **
మ్రింం * గేసి - కూ * డ ** - నంగనాచి - తుంగలా *
ఏ మెరుగని - దానిలా * - నిర్మలముగ - పారేవు * ॥ఎంత॥

నోట - మరుగు - క్రక్కుచు * - ఒడలు - సుడులు - తిరుగుచు **
ఉరక - లేస్తు - పరుగు - తీస్తు - పెనురక్కసి - కోరలతో
విరుచుకపడ్డావు **** - మృత్యుభీతి - విహ్వాలురుగ
మనుజకోటి - గడగడవడ కించి గుండెలదరగొట్టేవు ॥ఎంత॥

చెట్టుకొకరి - పుట్టకొకరి - తరిమి తరిమి - కొట్టేవు *
కపిగందుల - పసి బాలుర - కసికసిగా * - నమిలేవు *
పసిడి పంటల వాసగే * - పైరుపచ్చ - పొలాలెల్ల
నీ శీతల - కరస్పర్శతొ - ముసిగముసిగ - మాడ్చేసి *
ఊళ్ళకూళ్ళు - నూడ్చేసి ** - . . . . . . . . . . .
యేమెరుగని - దానిలా * -నిర్మలముగ - పారేవు * ॥ఎంత॥




(జానపద గేయం) తిశ్రగతి - తకిట - తకిట

రారా** - ఓ * మా * - వా **** - రా*రా*
ఓ ** మా - వా ****- క్షణమైన - నమపి * డి
పోబో*క - రారా **- ఓ * మా *- వా ****
॥ ॥ ॥ ॥ ॥రారా॥

పిపి*డ - లేక *** - నీ తో * డు - లేక ***
క్షణమైన - మనలే*ను - ఓ * మా * - వా ****
ఒక్క ***- క్షణమైన - మనలే*ను .ఓ మావ *
నీ తో * డు - లోన *** - నీ పి*డ - లోన ***
నా **** - బ్రతుకంత - పం *** డి - పోనీయర ॥రారా॥

యే * జన్మ - లో*వి** - యే * పుణ్య - ఫలమో **
యీనా*డు - జతగూర్చె - మనను *** - ******
కనువిం*దు - గూర్చె ** - నీ పొం*దు - నాకు ***
నా బొం*దిలో ప్రా*ణ ముండే - వర - కు *****
తుది శ్వాస - నా నుం*డి - వీడే వరకు - నాకుండునటుల
- వరమీ*యు - మనుచు *** - వేడే*ను
ఆ యే*డు - కొండల ** - వెంకన్నను - ****** ॥రారా॥

# రావయ్య గణనాయక

జానపదగేయం

3 వ కాలం - తిస్రగతి - తకిట - తకిట - మాండురాగం

ఘల్లూ ఘ-ల్లూమంటూ - నీ కాలీ - గజ్జెలే

మారు* మ్రో - గంగా ** - రావయ్య * - గణనాయక ॥రావయ్య॥

ఓ * అయ్య - గణనాయక - మా అయ్యా - గణ నాయక

యేటేటా - ప్రతియింట * - నిన్ను * కొలువనివారు *

యెంతవెతికి - చూసినా * - కనరారు * - యే ఒక్కరు

నిండైనా - మనసుతో * - పూజలే * - చేస్తారు *

పందిళ్ళు * వేస్తారు * - భజనలే * -చేస్తారు*

నీ నామ * -స్మరణతో - దశదిశలు * - మార్మోగ *

జేజేలు * - కొడతారు * - . . . . . . . . . ఘల్లూ॥

ఆ **** - . . . . . . . . . . . . . . . . . .

విఘ్నాలు * - బాపేటీ * - నాయకుడే - నీవవి **

కుడుములే * - చేస్తారు * - ఉండ్రాళ్ళే - పెడతారు *

ఆయాశ * - పడకుండ * - కడుపార * - భుజియించి *

తలపెట్టిన - కార్యాలు * - అడ్డంకులు - లేకుండ *

శాంతి ** - సౌఖ్యాలు * - ఇంటింటా - విలసిల్ల *

దీవించి * -పోవయ్య * - మమ్ములకరు-ణించి *** ॥ఘల్లూ॥

# శ్రీ కృష్ణ నీ దివ్య నామ సంకీర్తనం

శ్రీ కృష్ణ దివ్యనామ సంకీర్తనం
సకల పాపహరం - సకల సంక్షోభ
క్షోభానివారణం . . . . . . . . . . . .
సంసార సాగర దుఃఖనివృతం - మనోశాంతి ప్రసాదితం
శ్రీ కృష్ణ దివ్యనామ సంకీర్తనం !

****

అ నిర్వచనీయ - బ్రహ్మానంద
డోలికాతరంగముల - నంతరంగమును తేలియాడించును
ఆ రంగని నామ స్మరణంబు - మోక్షదాయకంబు
అట్టి శ్రీ కృష్ణపదారవిందముల కేను సదాప్రణమిల్లెదన్

****

రమణీయ రూపం - కమనీయ గాత్రం
కమల ప్రత్యేక్షణ నేత్రం ! కరుణారస వీక్షణం
క్షణక్షణం - అనుక్షణం
ఆనందామృతపానం - శ్రీ కృష్ణవేణుగానం !!

****

విశ్వలోకకారణం - విశ్వరూపం
విశ్వాత్మకం - విష్ణుం - శ్రీ కృష్ణ పరమాత్మం
భవచరణం - శరణం - శరణం !!

****

వక్షస్థలే - కౌస్తుభహారం - శిరసేమణిమయమకుటం
కరేకంకణం కర్ణకుండలం - అఖండమండలాకారం
శుభాంగం - సర్వ మంగళకరం - ఊహాతీతం - అనిర్వచనీయం
అద్భుతం వర్ణనాశక్యం
శ్రీ కృష్ణ మధుర మనోహరరూపం !

****

---

"చంద్రకిరణాలు" సమాప్తం ఓ సర్వేజన సుఖినోభవంతు !

ఓం - శాంతి ! శాంతి !! శాంతి ః